# శ్రీముఖ సూక్తి

ప్రథమ భాగము

బచ్చు పాపయ్య శ్రేష్ఠి

తిరువాయ్మొళ్ళి

అనువాదము

శ్రీ

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః

# ప్రవేశము

ఆళ్వార్లు :

జ్ఞానవృని మనస్సునుండి నిరంతర తైలధారవలె భగవదు న్ముఖమై ప్రసరించు ప్రేమప్రవాహమే భక్తి. ఈ భక్తి సామ్రాజ్యమునకు పట్టాభిషేకమును జేసిన మహాత్ములు 'ఆళ్వార్లు'. వీరు ద్వాదశసంఖ్యాకులు.

భూతం సరస్య మహదాహ్వయ భట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్.

అనగా పూదత్తాళ్వార్లు, పొయ్ గైయాళ్వార్లు, పేయాళ్వార్లు, పెరియాళ్వార్లు, ఆండాళ్, తిరుమళిశైయాళ్వార్లు, కులశేఖరాళ్వార్లు, తిరుప్పాణియాళ్వార్లు, తొండరడిప్పొడియాళ్వార్లు, తిరుమంగైయాళ్వార్లు, మధురకవియాళ్వార్లు, నమ్మాళ్వార్లు అని పండ్రెండుగురు.

వీరి జీవితములు భగవచ్ఛరణాగతిపూరితములు. భగవత్కైంకర్యమే వీరికి ప్రాణాధారము. వీరిచిత్తములు సర్వదా అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపానవిశేష మత్తములు. ద్రావిడదేశము భక్తికి జన్మస్థానమనుప్రసిద్ధివిషయమున వీరేశ్రేష్ఠ నిదర్శనము. వీరు రచించినగ్రంథములందు వేద వేదాంతవిజ్ఞాన మపారవారముగా గన్పించుచున్నది. ఈయది భగవత్కటాక్షముచే మనస్సునం దావిర్భవించినజ్ఞాన మని చెప్పక తప్పదు.

తిరువాయ్ మొழி యన్ననో ప్రథమపాశురము మొదలంత్యపాశురమువఱకు భక్తియే! భగవదున్ముఖ మగుప్రేమప్రవాహమే! అపార మగుభగద్గుణానుభవమే! భగవత్సాక్షాత్కారము కొఱకును, భగవత్సన్నిధానప్రాప్తికొఱకును నగు ప్రార్థనాపూర్వదీనసంభాషణములే! నాయకునికొఱకు విలపించునాయికయవస్థలే! దూతికాసందేశములే! వేయేల? భగవద్విషయము తప్ప వేఱువిషయ మైనయితరమొక్కటిగూడ నీగ్రంథమున లేదు. చేసినవర్ణనమే మరల మరల జేసె ననియు, బలికినప్రార్థనలే మఱి మఱి పలికెననియు విమర్శకులు కొందఱనవచ్చునుగాని మైమఱచి భగవద్గుణానుభవామృతపాన మొనరించు భక్తాగ్రేసరునిచిత్తమునుండి వెడలునఖండప్రేమప్రవాహమును గావ్యనియమములెట్లడ్డగింపగలవు, పునరుక్తిదోషములెట్లు బాధింపగలవు? బాహ్యేంద్రియసంచారమును మాని తదేకధ్యానముతో భగవన్నామమును జపించుట పునరుక్తియని యెవరేని ననుదురా!

తిరువాయ్ మొழிయందు మఱికొన్ని విశేషములు గలవు. ఆదినుండి యంత్యమువఱకు గలపాశురముల నన్నిటిని సంగీతజ్ఞులు రాగతాళములతో గీర్తనలుగా గానము చేయుదురు. ప్రాయశః గ్రంథకర్త యగునమ్మాళ్వార్లు రాగతాళములతో గానరూపముగ బలికినపలుకులే యీ గ్రంథముగా బరిణమించి యుండునోపు! గంటము చేతబట్టి తాళపత్రమున లిఖించినకవిత్వము గాదు. అనాయాసమానముగా పాశురరూపమై నమ్మాళ్వార్ల శ్రీముఖమునుండి వెడలినగానామృతమే యీ గ్రంథము. ఆదికవి యగు వాల్మీకిచే రచింపబడిన శ్రీమద్రామాయణమును నిట్టిదిగదా! కుశలవులచే రాగతాళములతో సంపూర్ణముగా శ్రీ రామాయణమును గానము చేయించెనుగదా వాల్మీకి.

సాధారణముగా నితరభాషాగ్రంథములయం దెచటను గన్పింపనివిశేష మొక్కటి యిందు గలదు. అది "అందాది" అందురు. అనగా బ్రతిపద్యముయొక్క యంత్యపదము మఱుసటిపద్యముయొక్క యాదిపదముగా నుండుట. ఎక్కడిపాశుర మక్కడకు ద్రుంపబడక యొకటి కొకటి లంకెవేసికొని గొలుసువలె నఖండమై దీర్పబడుట నిరంతర తైలధారవంటిభక్తికి నిదర్శనము. ఈ విశేష మితరు లగునాళ్వారుల గ్రంథములలోగూడ గొన్నింటియందు గలదు.

## తిరువాయ్మొழிవ్యాఖ్యానములు

ఈ గ్రంథమునకు దమిళభాషయందు గలవ్యాఖ్యానములలో ముఖ్యమైనవి యైదు.

1. తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ అనువారు వ్రాసిన 'ఆరాయిరప్పడి' అనగా 6000 గ్రంథము (గ్రంథ మనగా ముప్పదిరెండక్షరములు.)
2. నంజియ్యర్ అనువారు వ్రాసిన 'ఒంబదినాయిరప్పడి' అనగా 9000 గ్రంథము.
3. అళగియమణవాళజియ్యరు వ్రాసిన 'పన్నీరాయిరప్పడి' అనగా 12000 గ్రంథము.
4. పెరియవాచ్చాంబిళ్ళై అనువారు వ్రాసిన 'ఇరుపత్తునాలాయిరప్పడి' అనగా 24000 గ్రంథము.
5. నంబిళ్ళగారియుపన్యాసమును విని వడక్కుతిరువీధిపిళ్ళైగారు వ్రాసినది 'ముప్పత్తారాయిరప్పడి' అనగా 36000 గ్రంథము. ఇదియే వ్యాఖ్యానము లన్నిటియందును గొప్పది. దీనికి "ఈడు" అని ప్రసిద్ధనామము. దీనినే భగవద్విషయ మందురు.

ఈ వ్యాఖ్యానములలో గొన్నింటికి గొందఱు గ్రంథకర్తలు విశేషార్థసూచనాగ్రంథములనువ్రాసియున్నారు. 'ఈడు' వ్యాఖ్యానగ్రంథకర్త లగునంబిళ్లగారినిగుఱించియు వడక్కుతిరువీధిపిళ్లగారిని గుఱించియు జనసామాన్యము చెప్పుకొనుగాథ యొకటి గలదు.

పూర్వము 'ఒంబదినాయిరప్పడి' అనువ్యాఖ్యానమునకు కర్త లగునంజియ్యరుగారు తనగ్రంథమును శుద్ధముగా వ్రాయగలవిలేఖరికై వెదకుచుండగా కావేరీదక్షిణతీరవాసి యగునంబూరు వరదరాజు లనుసమర్థుడు దొరకెను. వారిని బిలిపించి వారు సామాన్యవైష్ణవు లగుటంజేసి యీయుత్తమగ్రంథము వ్రాయునర్హత నొసంగుప్రపన్నానుష్ఠానాదులు గఱపి వారికి దనగ్రంథము నిచ్చి చక్కనియక్షరములతో వ్రాయు మని పంపిరి. వారు కావేరి దాటిపోవుచుండ నదీప్రవాహము బలిష్ఠమై గ్రంథము కొట్టుకొని పోయెను. వారు మిక్కిలి చింతాక్రాంతులై గట్టుచేరి నంజియ్యరుగారియొద్ద గ్రంథ మాద్యంతముచక్కగా వినినవా రగుటంజేసితద్విషయములనెల్ల జక్కనిగ్రంథముగా వ్రాసి గురువునకు దెచ్చి యిచ్చిరి. నంజియ్యరుగారన్ననో యాగ్రంథమును జక్కగా బారజూచి తాను వ్రాసినవిషయములకంటె విశేషాంశము లనేకములం దుండుటం గని వ్యత్యాసమునకు గారణ మడిగిరి. వరదరాజులు జరిగినయుదంతము వాక్రుచ్చినతోడనే గురు వానందపరవశుడై ఆహా! నంబిళ్లా (నా కుమారా) యని యతనిం గౌగిలించెనట! తదాది వరదరాజులకు నంబిళ్ల యని ప్రసిద్ధనామ మేర్పడెను. కాలక్రమమున భాగవతకోటికి దిరువాయ్మొழி గూర్చి ప్రతిదినము వా రొనర్చునుపన్యాసములను విని వడక్కుతిరువీధిపిళ్లగా రాయుపన్యాససారములను నొకగ్రంథముగా వ్రాసి గురు వగు నంబిళ్లగారికి జూపిరి. అయ్యదియే 'ఈడు ముప్పత్తాఱాయిరప్పడి.'

## తిరువాయ్ మొழி లో వర్ణింపబడిన దివ్యస్థలములు

| దివ్యదేశము. | నామాంతరము. | తిరువాయ్ మొழி<br>శ - ద |
|---|---|---|
| 1. శ్రీరంగము | తిరువరంగము | 7 - 2 |
| 2. తిరువేంగడము | తిరుమల | 3 - 3 |
| ,, | ,, | 6 -10 |
| 3. తిరుక్కురుగూరు | తిరునగరి | 4 - 10 |
| 4. తిరుక్కురుంగుడి | | 5 - 5 |
| 5. వానమామలై | శిరీవరమంగై | 5 - 7 |
| 6. కుంభఘోణము | తిరుక్కుడందై | 5 - 8 |
| 7. తిరువల్లవాళ్ | | 5 - 9 |
| 8. తిరువణ్వణ్డూర్ | | 6 - 1 |
| 9. తిరువిణ్ణగర్ | | 6 - 3 |
| 10. తిరుత్తొలైవిల్లిమంగలం | తొలైవిల్లిమంగలం | 6 - 5 |
| 11. తిరుక్కోళూర్ | | 6 - 7 |
| 12. తెన్ తిరుప్పేరై | తిరుప్పేరై | 7 - 3 |
| 13. తిరువాఱన్విళై | | 7 10 |
| 14. తిరుక్కుళందై (తెన్కుళన్దయి) | పెరుంకుళమ్ | 8 - 2 |
| 15. తిరువణ్ పరిశారం | | 8 - 3 |
| 16. తిరుచ్చెంగున్నూర్ | | 8 - 4 |
| 17. తిరుక్కడిత్తానమ్ | | 8 - 6 |
| 18. తిరుప్పులియూర్ | కుట్టనాడు | 8 - 9 |
| 19. తిరుప్పులింగుడి | | 9 - 2 |
| 20. వరగుణమంగై | | 9 - 2 |
| 21. శ్రీవైకుంఠము | | 9 - 2 |
| 22. తిరుక్కాళక్కరై | | 9 - 6 |

మన దేశమందలిముఖ్యసిద్ధాంతము లీక్రింద
సూక్ష్మముగా వివరింపబడుచున్నవి.

## వి వి ధ మ త ము లు

1. ప్రత్యక్షవాదము :

భూమి యుదకం బనలవాయు – వు లను నాల్గు
నొక్కటిగగూడ చైతన్య – మొందు పుట్టు;
దాని సౌఖ్యానుభవమె స్వ – ర్గానుభవము
దాని దుఃఖంబె నరకమై – దనరుచుండు;

*　　　　*　　　　*

భూతములు వీడ చైతన్య – మును నశించు
దానిపిమ్మట నొకటియు – గానబడదు

*　　　　*　　　　*

తెల్లముగనిట్లు లోకాయ – తికుడువక్క
నిదియ చార్వాకమతముగా – నెరుగవలయు

**2.** జైనసిద్ధాంతము :

కార్యకారణరూప మౌ - కతన జగతి
ననవలయు నిత్యమును నని - త్యం బటంచు
భిన్నమనియును మరియు న - భిన్నమనుచు
సత్య మనియును మరియు న - సత్య మనుచు

*　　　　*　　　　*

ఆత్మలెల్లను గర్మవ - శ్యంబు లగుట
ననుగుణంబు లౌ దేహంబు - లధివసించి
వానిపరిమితి దామును - బూనియుండు

*　　　　*　　　　*

అరయ సంసార మనున ద - నాది యగును
దనువు మలధారణాదివ్ర - తముల నలుప
నాత్మవిషయకజ్ఞానంబు - నంది, బంధ
ముక్తుడై యూర్ధ్వగతి కేగ - మోక్ష మంద్రు

*　　　　*　　　　*

ఆర్హతమం డట్లు వచియించె - నావియందు
మీదప సిది జైనమతి మను  పేరు గాంచె

**8.** బౌద్ధమతమున వైభాషికము :

జగతి పరమాణుసంఘాత - మగుచు వెలసి
గోచరం బగు ప్రత్యక్ష - గోచరముగ
నట్టిజగతికి సంబంధి - యైనజ్ఞాన
మదియు క్షణికంబె; వేఱ లే - దాత్మ యనగ;
దీనియందున క్షణికబు - ద్ధిని వహింప

నదియె మోక్షంబు; వేరైన - దెదియు లేదు

* * *

బౌద్ధమత మిట్లు చెప్పె వై - భాషికుండు

4. బౌద్ధమతము సౌత్రాంతికము :

అదియె సౌత్రాంతికునిమతం - బగునుగాని
యాంత డనుమానసిద్ధ మా - ననియె జగతి
బౌద్ధమున ద్వితీయంబైన - పద్ధతి యిది

5. బౌద్ధమతము యోగాచారము :

ఈమతమున యోగాచార్యు - డిట్టు లనక
జ్ఞాత భ్రమ మగు; జ్ఞేయంబు - సహిత మట్లె
జ్ఞాన మనునది యొక్కటే - సత్య మగును ;
అట్టిజ్ఞానము క్షణిక మౌ - నని యెఱుంగ
నదియె మోక్షంబు, వేఱు లే - దని వచించె

* * *

బౌద్ధమున తృతీయం బగు - పద్ధతి యిది

6. బౌద్ధమతము మాధ్యమికము :

మాధ్యమికుని మతంబు ప్ర - మాణ మనఁగ
మఱి ప్రమేయం బనంగ ప్ర - మాత యనఁగ
మూఁడు గల వనుటే భ్రమం - బుఁగ దలంచె ;
నన్నిటిని శూన్య మనుచు శూ - న్యంబుచేత
దెలిసికొనుటయె మోక్షంబు - కలిమి యనియె

7. నైయాయికము :

జగతి పరమాణుసంఘాత - మగుటవలన
నణువులే యుపాదానకా - రణము లనియు

మఱియు ననుమానసిద్ధుఁ డీ - శ్వరుఁ డనియును
నాతఁడు నిమిత్తకారణం - బగు ననియును
నరయ సంసార మనున ద - నాది యనియు
నట్టి యీశ్వరోపాసనం - బాచరించి
నరుఁడు సుఖదుఃఖముల రెంటి - నాశనంబు
సేయ నదియ మోక్షంబు నై - యాయికునకు

8. వైశేషికము :

చెప్పె నీరీతిగా నె వై - శేషికుండు

9. పాశుపతము :

తలప బరమాణువులె యుపా - దానకార
ణము లటంచు ; జగత్తు కా - ర్యములందు
గలుగునీశ్వరుండె నిమిత్త - కారణం బ
టంచు మరియు సంసార మ - నాది యంచు,
నాగమోక్తము లగుకర్మ - లాచరించి
పశుపతికి దుల్యు మైనరూ - పమును బొంద
బాశుపతమతమోక్ష మై - పరగుచుండు

10. సాంఖ్యము ( సేశ్వరులు, నిరీశ్వరులు )

ప్రకృతి స్వాతంత్ర్యము వహించి - పరిణమించి
కారణం బగుచుండు జ - గత్తు కనియు
బ్రకృతితోడ ననాదిసం - బంధ మాత్మ
కలరుచుండుట సంసార - మనియు, నట్టి
ప్రకృతిపురుషవివేకలా - భంబె మోక్ష
మనియు సాంఖ్యమతస్థుల - యభిమతంబు

11. యోగము :

ఇట్టులే యోగులును వచి - యించుచుంద్రు

12, 18. భాట్టప్రాభాకరములు :

నిత్యులగుచు ననేకులై - నిఖిలజగతి
వ్యాప్తి గలవారు నాదిలే - నట్టికర్మ
వలన సంసారమందు జీ - వులు వసింత్రు;
తనరు జగతి ప్రవాహని - త్యంబు గాగ,
కర్మనుండి యపూర్వ మో - కండు పుట్టి
మోక్ష మైనయాత్మప్రాప్తి - బొందజేయు;
ఈశ్వరుం డనుపేర వే - రెవడు లేడు;
పల్కి రిట్లు భాట్టుడును ప్రా - భాకరుడును;

14. అద్వైతము (మాయావాదము) :

జ్ఞానమాత్రంబు నిర్విశే - షంబు బ్రహ్మ;
మదియె జీవుండు ; వేఱుజీ - వాత్మ లేదు;
స్వగత మైన సజాతవి - జాత మైన
భేదములు లేక యయ్యది - వెలయుచుండు
స్వయముగా ప్రకాశం బగు - వస్తు వగుట;

* * *

అద్వితీయ మేకంబు బ్ర - హ్మం బటంచు
బల్కు శ్రుతుల కీయర్థంబు - బాగు గాదె?

* * *

బ్రహ్మ మియ్యది మాయచే - బట్టువడగ
జన్య మగుభ్రాంతి నంద్రు సం - సార మనుచు;
నట్టిమాయ కవిద్య యం - చనియు పేరు;
ద్వివిధముగ బ్రవర్తించు న - విద్య పేర్లు

చెలగు నాచ్ఛాదక మని వి - క్షేపక మని;
యందు నాచ్ఛాదకంబు బ్ర - హ్మమును గప్పు
బిదప విక్షేపికావిద్య - వివిధరూప
నామముల దాల్చి యాడించు - నాటకంబు

* * *

'తత్త్వమ' స్యాదు లైనశ్రు - త్యర్థములను
జెలగు జ్ఞానంబుచే భ్రాంతి - దొలగిపోవ;
గలుగుటే మోక్ష మంద్రు శం - కరమతమున

15. అద్వైతము (భాస్కరీయము):

భాస్కరుని దైనయద్వైత - పథమునందు
బ్రహ్మమును గప్పి యున్నయు - పాధి సత్య
మనియు; దేహేంద్రియాదికం - బైనయుపాయు
పాధిసంగంబె సంసార - బాధ యనియు;

* * *

మరియు వర్ణాశ్రమాచార - పరతతోడ
"తత్త్వమ"స్యాదు లైన శ్రు - త్యర్థపూర్వ
క మగునట్టియుపాసన - గలుగజేయు
జ్ఞానమున నయ్యుపాధి నా - శనము బొందు;
ననియు; నియ్యదియే మోక్ష - మని దలంత్రు

* * *

ఘటము నశియింప దద్ఘటా - కాశ మెల్ల
నామహాకాశమం దైక్య - మైనయట్టు
లిల నవిద్య యైనయుపాధి - దొలగి పోవ
బ్రహ్మ మైక్యంబునుం బొందు - బ్రహ్మమున నె;

* * *

శంకరుని వలె నిర్గుణ – సత్యమనక
బ్రహ్మమును సగుణంబుగా – బల్కె నితడు

16. అద్వైతము (యాదవప్రకాశీయము) :

యాదవప్రకాశునిమత – మందు బ్రహ్మ
సత్యమయ్యును జిదచిదీ – శ్వరము లగుచు
బరిణమించును మూడురూ – పముల బొంది;

*　　*　　*

వీనినిఁ బ్రహ్మమునకంటె – భిన్ను లనెడు
తలపు సంసార మనియు శ్రు – త్యర్థజనిత
మైనజ్ఞానంబుతో గర్మ – మాచరింప
భేదబుద్ధి నొ నజ్ఞాన – విధి దొలంగు;
నదియె మోక్షం బగు నటంచు – నతడు పల్కె

*　　*　　*

కర్మమున వీడు బ్రతిబంధ – కంబులెల్ల
జ్ఞాన మగును బ్రహ్మప్రాప్తి – సాధనంబు

*　　*　　*

మరియు భాస్కరాచార్యబ్రహ్మ – హ్మంబువలెనె
యితనిబ్రహ్మంబు సగుణమై – యెసగుచుండు

17. ఏకాయనము :

ద్వైతమత మైనమాధ్వమ – తంబునందు
లక్ష్మి లేకుండ నొక్కనా – రాయణుండె
ప్రాప్య మగు నని పండితు – ల్పల్కుచుంద్రు;
బ్రహ్మ కతిపయశక్తి సం – పద్యుతుండు

*　　*　　*

అఖిలజగతికి గారణం - బతడె యనుచు
బల్కు వైదికసిద్ధాంత - పథముకంటె
భేద మిదియె చేకాయను - వాదమందు

ఇట్టు లీయన్యసిద్ధాంతము లంతర్భేదములతో గూడి పదు నేడు. ఇందు లోకాయతుడు, ఆర్హతుడు, బౌద్ధుడు, నైయాయికుడు, పాశుపతుడు, సాంఖ్యులు అనువారిసిద్ధాంతములు వేదబాహ్యములు.

భాట్ట, ప్రభాకర, శంకర, భాస్కర, యాదవ, ఏకాయనుల సిద్ధాంతములు వేదానుసారములైనను వేదార్థమును వేఱు వేఱు విధముల నవలంబించుచున్నవి.

త్రిమతములు :

వైదికమతములందు ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములు సుప్రసిద్ధములు. ఈ త్రిమతములకు వేదమే ప్రమాణము. వేశము ప్రమాణముగా గలమతములు మఱికొన్ని గలవు. అవి యంతగా ప్రాముఖ్యము పడయ లేవు. ఈ మూడుమతముల సిద్ధాంతములను శంకర రామానుజ మధ్వాచార్యులు సృష్టించి రని పామరజనుల యందొకయభిప్రాయము గలదు; కాని యది పొరపాటు. అనాదిగా ఋషిప్రోక్తములై వచ్చు నుపదేశములను శంకర రామానుజ మధ్వాచార్యులు న్యాయశాస్త్రానుగుణము లగు వాదప్రతివాదములతో సిద్ధాంతము లొనర్చి లోకమున బ్రచారముచేసి స్మృతికారకులవలె జట్టములం దీర్చిరి. అంతేగాని యందు వీరి స్వకల్పితము లేవియు లేవు. ఈ యాచార్యవర్యులు ముగ్గురును దక్షిణ హిందూస్థానమువారై యుండినందులకు మన మెంతయు గర్వింపదగియున్నది. శంకరాచార్యు లిప్పటికి రమారమి 1600 సంవత్సరములనాటివా రనియు, రామానుజులు 1200 సంవత్సరములనాటివా రనియు,

మధ్వాచార్యులు 900 సంవత్సరములనాటివా రనియు జరిత్రకారులు వ్రాయుచున్నారు. ఇప్పటికి సుమా రయిదాఱువందల సంవత్సరములనాడు సాయనభాస్కరనామాంతరము గల విద్యారణ్యులును, వేదాంతదేశికులును, అక్షోభ్యమునులును, సమకాలికులుగా జనించి అద్వైత విశిష్టాద్వైత ద్వైతమత గ్రంథము లనేకములు రచించి, ప్రచారముచేసి మహాసభలు జరిపి తమతమమతములకు దిగంతవిశ్రాంతకీర్తిని నెలకొల్పిరి. చతుర్వేదములకు సంపూర్ణమగువ్యాఖ్యను వ్రాసినవిద్యారణ్యునిప్రతిభావిశేషము నెవ్వరు వర్ణింప గలరు? వారి వ్యాఖ్యయే లేకుండినచో వేదచతుష్టయము పామరులకేగాక పండితులకుసహిత మగోచరమై యుండెడిది. అట్టి సరస్వతీస్వరూపునితో వాదముచేసి వారి యద్వైతసిద్ధాంతమును ఖండించినయక్షోభ్యముని యెంతసమర్థుడో చెప్పవలసినది లేదు. వీరిరువురి పత్రికావాదములకు మధ్యస్థులై హెచ్చుదక్కువలు నిర్ధారణచేసినమహాపండితులు వేదాంతదేశికులు. శపథము పూని యొక్కరాత్రి మహారసవంతము లగు వేయిశ్లోకములతో రామపాదుకలనుగూర్చి 'పాదుకాసహస్ర'మను గ్రంథము రచించిన మహామేధావి ఈయన. వీరి కవిత్వస్వారస్య మమోఘము. అక్షోభ్యవిద్యారణ్యులకు జరిగినవాదముపై వీరు చేసినతీర్మానము చూడుడు:

> అసినా తత్త్వమసినా
> పరజీవ ప్రభేదినా,
> విద్యారణ్య మహారణ్య
> మక్షోభ్యముని రచ్ఛినత్.

చతుర్వేదములయం దొక్కొకటను ననేకాధ్యాయములు గలవు. ఆ యధ్యాయములన్నియు వివిధకర్మములనుగూర్చి వచించు

చుండును. సాధారణముగా ప్రత్యధ్యాయముయొక్క కడపటి యాశ్వాసము బ్రహ్మవిషయకముగా నుండును. అట్టి కడపటి యాశ్వాసములు వేదభాగములకొనలుగా నుండుటచే వానిని 'వేదాంతము' లందురు. వానికే 'ఉపనిషత్తు' లని పేరు. ఈ విధముగా నేర్పఱచి చూచినచో ననేకోపనిషత్తులేర్పడుచున్నవి. అష్టోత్తరశతము (అనగా నూటయెనిమిది) అనుసంఖ్య యేకారణముచేతనో మన పెద్దల కాలము నుండి పవిత్రముగా భావింపబడుచున్నది. అందువలన ననేకోపనిషత్తులనుండి మనపూర్వికులు నూటయెనిమిదియుపనిషత్తుల నేర్పఱచి వానిని 'అష్టోత్తరశతోపనిషత్తు' లనిరి. ఈ యష్టోత్తరశతోపనిషత్తులొక్కొక్కటి యొక్కొక్కవిధ మగుమార్గమును జపతపోవిధానమును నిర్ణయించుచున్నవి. అవియన్నియు సదుపదేశములే యైనను నం దనేకములు ప్రత్యేకప్రత్యేకదేవతాద్యుపాసన లగుటంజేసి శ్రీశంకరాచార్యులవారు వానిలో గేవలము పరబ్రహ్మవిషయకము లగువానినిగా బదియుపనిషత్తులను స్వీకరించి తన యద్వైతసిద్ధాంతస్థాపనమునకు బ్రమాణములుగా నంగీకరించెను. ఆ పదియుపనిషత్తులనే శ్రీమద్రామానుజాచార్యులును శ్రీమధ్వాచార్యులును బ్రమాణములుగా జేకొని తమ విశిష్టాద్వైత ద్వైత సిద్ధాంతములను స్థాపన మొనర్చిరి. త్రిమతాచార్యు లంగీకరించిన యీపదియుపనిషత్తులు 'దశోపనిషత్తు' లనబడుచున్నవి. వైదిక సిద్ధాంతములన్నిటికి నీ దశోపనిషత్తులే మూలము. వీనినుండి యత్యంతముఖ్యము లగువాక్యముల నేర్పఱచి వేదవ్యాసమహర్షి బ్రహ్మసూత్రములను రచియించెను. ఈ బ్రహ్మసూత్రములుగాని దశోపనిషత్తులుగాని మహాపండితులకే గోచరము లగుచుండుటచేత వేదవ్యాసు లీ కష్టము దొలగింప బ్రయత్నించి యుపనిషదర్థములను నింకను విశదీకరింపదలంచి మహాభారతమునందలి భగవద్గీ

తను వ్రాసిరి. ఈవిధముగా నేర్పడిన 'దశోపనిషత్తులు' 'బ్రహ్మ సూత్రములు' 'భగవద్గీత' అను మూడుగ్రంథములు 'ప్రస్థానత్రయ' మని చెప్పబడుచున్నవి. త్రిమతాచార్యులును వారివారి సిద్ధాంతముల కనుగుణముగా ప్రస్థానత్రయమునకు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు.

బ్రహ్మ మొక్కటియే సత్యము. జీవుడు, ప్రకృతి యనునవి లేవు. జగత్తంతయు మిథ్య. అజ్ఞానముచే నిట్లు కనబడుచున్నది. అజ్ఞానము దొలగినచో మనుష్యునకీజగత్తనెడిభ్రమ దొలగి పోవును. అంతవఱకును ముక్తి గలుగదు. అజ్ఞానము (అనగా మాయ) తొలగినవెనుకనే బ్రహ్మమే తా నని మనుష్యుడు తెలిసికొనుచున్నాడు. అదియే ముక్తి. శరీరమునందున్నను నజ్ఞాననివృత్తియైనయెడల వాడిచ్చటనే మోక్షమును బొందినవాడగును. దానినే 'జీవన్ముక్తి' యందురు. జీవన్ముక్తి బొందినవానికి శరీరమున్నను లేకున్నను నొక్కటియే! వాడు సర్వదా ఆనందముగా మాఱి వర్తించుచుండును. బ్రహ్మమునకు కల్యాణగుణములుగాని హేయగుణములుగాని లేవు ; అది నిర్గుణము. కేవలచైతన్యమే బ్రహ్మము. తదితర మంతయు మిథ్య. త్రాడు జూచి సర్ప మని భ్రమించునట్లు బ్రహ్మమును జూచి జగత్తని యజ్ఞానముచే భ్రమించుచున్నాము. జ్ఞానబోధచేత నజ్ఞానము దొలగినవెంటనే సర్పభ్రాంతి పోయి సత్య మగుత్రా డెట్లు గనబడునో యట్లే జ్ఞానముచేత జగద్భ్రాంతి పోయి మనుష్యుడు తనబ్రహ్మత్వమును దెలిసికొనును. ఘటమునందును, ఘటము వెలుపలను నొకేయాకాశము వ్యాపించియున్నదిగదా. ఘట మున్నంతకాల మాఘటాకాశ ముండి ఘటవిచ్ఛేదనానంతర మంతయు నొకేయాకాశ మెట్లగుచున్నదో యజ్ఞానవృత మైన బ్రహ్మ మజ్ఞాననివృత్త్యనంతరము బ్రహ్మము

కంటె వేఱుగా గనిపింపదు. ఈయది యద్వైతసిద్ధాంతము. ఇంక జ్ఞానమే మోక్షోపాయము. అది చేకూరినవెంటనే 'అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి, సోఽహమ్' ఇత్యాదివాక్యములు పఠించునప్పు జీవుడు తనను దానే బ్రహ్మముగా దెలిసికొనుచున్నాడు. ఈశ్వరారాధనా జపతపంబులు మొదలగునవి యజ్ఞాననివృత్తికొఱకు జేయబడుకార్యములు అని వారి యభిప్రాయము. కేవల నిర్గుణబ్రహ్మతత్త్వము వారికి గమ్యము. ఈ సిద్ధాంతముప్రకారము జీవుడేగాక యీశ్వరుడుగూడ నజ్ఞానావృత మైనబ్రహ్మమే. గుణసమ్మేళన మంతయు నజ్ఞానమే గనుక సృష్ట్యాదిగుణముల నావహించినయీశ్వరుడుగూడ నిర్గుణ పరబ్రహ్మమువలె క్షణికము గాక శూన్యము గాక నిత్యము సత్యమునై యున్నది. అద్వైతమతమున మోక్షప్రాప్తికి జ్ఞానమే సాధనము. మోక్షస్థాన మనునది వేఱొకటి లేదు. అజ్ఞాననివృత్తియై గుణసంశ్లేషము లేక కేవలము జ్ఞానైకాకారము నొందుటయే మోక్షము. స్వప్నము లేనినిర్మలసుషుప్త్యవస్థ యెంతయానందదాయకమో మోక్షము నట్టిదియే యని యద్వైతసిద్ధాంతము.

మాధ్వసంప్రదాయస్థు లగు ద్వైతుల సిద్ధాంత మిందులకు విరుద్ధము. బ్రహ్మము జీవుడు ప్రత్యేకతత్త్వము లని వారి మతము. సర్వజగత్తునకు సృష్టిస్థితిలయకారకు డగుపరబ్రహ్మ మెక్కడ! అజ్ఞానపూరిత సంసారాంధకారమున బడి దొర్లుచుండుజీవు డెక్కడ! ప్రారబ్ధమున దగులుకొని కర్మానుభవ మొనర్చుజీవునకు దన్నివృత్తికొఱకు నిరంతరానుష్ఠానవ్రతాద్యాచరణమే మోక్షోపాయము. అట్టి నిష్ఠాజీవనముచే జీవునకు బ్రతిబంధకనివృత్తి యై నారాయణ పాదారవిందముల సన్నిధికిం జనునర్హత చేకూరును. అట్టి పరమస్థానమునందు అనగా భగవత్పాదసాన్నిధ్యమున గలుగుజీవులు సదా శ్రీ వైకుంఠనాథుని కటాక్షవీక్షణము లనుభ

వించుచు దదితర వస్తువైరాగ్య మవలంబించి సేవ లొనరించు చుండుటయే ద్వైతులపరమావధి. మోక్షస్థానమునసహితము సర్వ జీవులకు దమ స్వకీయాకారములే వర్తించు చుందు నని వారి సిద్ధాంతము.

ద్వైతాద్వైతమతసిద్ధాంతములయందు గలకొన్ని క్లిష్టపరిస్థితులకలయికం బొందక యారెంటికినిసవరణయనందగినసిద్ధాంతము విశిష్టాద్వైతము. జీవుడు, ప్రకృతి, బ్రహ్మము అనునవి మూడుత త్త్వములు. వీనినే 'చిదచిదీశ్వరులు' అందురు. అద్వైతమునుంబోలె చిత్తు అచిత్తు మాయాకల్పితము లగుబ్రహ్మము గాదు. చిత్తు అచిత్తు ఈశ్వరుడు అను మూడు తత్త్వములును సత్యములే. జగత్తంతయు మిథ్య యనియు ఈశ్వరుడు మాయకు లోబడి, అసలే లేని జగత్తును నున్న దని భ్రమించు చున్నా డనియు వచించునద్వైతవాదమును విశిష్టాద్వైతు లంగీకరింపరు. జీవునకును బ్రహ్మమునకును గలయికయే లే దనుద్వైతవాదమునుగూడ వీ రొప్పుకొనరు. పరమాత్మ (అనగా బ్రహ్మము) సర్వాంతర్యామియనియు, ప్రకృతిజీవులకిరువురకును బ్రహ్మము ఆత్మ యనియు, బ్రహ్మమునకు ప్రకృతియు జీవుడును శరీరము లనియు వీరిసిద్ధాంతములు. అంతర్యామిత్వముచే బ్రహ్మముతో శరీరశరీరిసంబంధము లేని జగద్వస్తు వేదియు లేదు; ఉండజాలదు. బ్రహ్మమే సర్వమునకును ఆత్మ. బ్రహ్మము గుణములు లేనివాడు గాడు. అనంతకల్యాణగుణములకు నాకరమైనవాడు; ఆనందమయుడు; భక్తజనవత్సలుడు; పురుషాకారుడు. జీవునకును బ్రహ్మమునకును స్వరూపమునందు భేదము లేదు. కర్మవిచ్ఛేదనానంతరము మోక్షార్హు డగుజీవుడు పరమపదమునం జేరి బ్రహ్మసామ్యమును బొంది యనంతకల్యాణగుణముల నధివసించి యానందమయు డగు బ్రహ్మమును నవవిధసంబంధములను గలిగి

యనుభవించుచున్నాడు. మోక్షమునందలి యానందము కల్యాణ గుణోపేతుఁడగు పరమాత్మయొక్క గుణానుభవమును ప్రత్యక్షముగా నొందుటయే! ఈయది శరీరత్యాగానంతరమేగాని తత్పూర్వము కలుగదు. పరబ్రహ్మ మెక్కడ! సుషుప్త్యవస్థయెక్కడ! అట్టియానందమునకు వీరిమార్గము భక్తి. భక్తియొక్క కాష్ఠా దశయే ప్రపత్తి. (అనగా సంపూర్ణ శరణాగతి) అహంవృత్తమును వేళ్లతోఁ ఛేదించివైచి సర్వమునకు బ్రహ్మమే స్వతంత్రుఁడు; స్వామి యని శరణాగతి చేయుట ప్రపత్తి. బ్రహ్మము భోక్త, జీవప్రకృతులు భోగ్యవస్తువులు. జీవునకహంకారనిర్మూలమైననేదప్ప బ్రహ్మమునకర్హమగునిర్మలభోగ్యవస్తుత్వము చేకూరదు. కనుక శరణాగతి లేక మోక్షము నొందరు.

ఈ త్రిమతములును వేదముపై నాధారపడియున్నవి. ప్రస్థానత్రయము వీరికి ప్రమాణ గ్రంథములు.

## విశిష్టాద్వైతము

ద్వైతాద్వైతములయందు గలకొన్ని క్లిష్టపరిస్థితులను దొలగించి చిదచిదీశ్వరతత్త్వత్రయమును సిద్ధాంతీకరించుచు బ్రహ్మసూత్రోపనిషద్గీతాదులను విశదపఱచిన శ్రీమద్బోధాయనసూత్రానుగుణమగు విశిష్టఅద్వైతము విశిష్టాద్వైతము. గ్రంథవిస్తరభీతిచే నీయది యిచ్చట సవిస్తరముగా విమర్శింపబడలేదు. పెరియాళ్వార్ తిరుమొழిని భట్టనాథశ్రీసూక్తి యనుపేర ననువదింపబడుట భగవత్సంకల్పముగా స్ఫురించుటవలన దనుపోద్ఘాతమున గొంతవఱకు విశిష్టాద్వైతసిద్ధాంతము విపులముగా లిఖింపబడుగాక!

## ఆచార్యపరంపర

పదునాలుగేండ్లప్రాయముననే క్రీ॥ శ॥ 1907 సం॥ మే నెల 17 తేది నాకు వివాహమైనది. అప్పుడు నాసతీమణికి బదునొకండు

సంవత్సరములు. వివాహ కాలముననే మా యాచార్యవర్యులగు శ్రీ లంకా కందాళ వేంకటాచార్యులవారు సతీసమేతముగా విచ్చేసియుండి మా కిరువురకును సమాశ్రయణము నొసర్చి మంత్రగ్రహణ భాగ్యము నొసంగిరి. నేటివరకు మాకు గల యాధ్యాత్మిక సర్వస్వము వారియనుగ్రహమే! వారికెల్లప్పుడు మా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

దాదాపు 1933-34 సంవత్సరముల ప్రాంతమున ఉభయ వేదాంతప్రాజ్ఞులగు శ్రీమాన్ కోమాండూరు నరసింహాచార్యులవారు మాకు తిరుమంత్రార్థ కాలక్షేపము ననుగ్రహించిరి. వారి కటాక్షమున మన సిద్ధాంతమునందు కొంతవరకు ప్రవేశము కలిగెను. విశిష్టాద్వైతమునందు వారు మాకు కలుగజేసిన అభిరుచికిని పునాదికిని వారి కెంతయు మేము కృతజ్ఞులము.

ఉపనిషద్విద్యాప్రారంభము శ్రీమాన్ ఉపన్యాసభూషణ విద్వాన్ కొండూరు రామానుజాచార్యులవారి సన్నిధిని జరిగెను. ఈశ కేనోపనిషత్తులు వారియొద్ద బఠించితిమి. పఠనతోడనె యాంధ్ర పద్యానువాదముగూడ భగవంతుడు మమ్ములను కలముగా గొని జరిపించెను. ప్రతిగ్రంథానువాదమునకును భగవదనుగ్రహము మా యందిట్లే ప్రసరించుచున్నది. అందువలననే భగవత్కటాక్షము నిర్హేతుకమను సిద్ధాంతము మాయంతరంగముల నెలకొల్పబడెను.

పిమ్మట శ్రీ న్యాయ వేదాంత విద్వాన్ అనందాంపిళ్ళె గోవింద ప్పయ్యంగార్లవారి కటాక్షమున కఠ ప్రశ్న ముండకోపనిషత్తులపఠనము లభ్యపడెను. ఏ యుపనిషత్తునందే భాగమైనను వారు అనర్గళప్రవాహముగా నుపన్యసింప గలరు.

వీరి యఖండ వేదాంతజ్ఞానమును జ్ఞాపకశక్తియు నద్వితీయములు. ప్రస్తుతము వీరు శ్రీరంగమున శ్రీరంగనారాయణజియ్యరు పదవి నలంకరించుచున్నారు. వారియందు నాకు గలకృతజ్ఞత నెట్లు చూప నగునో దెలియదు. నమస్కారములనుమాత్ర మిట విన్నవింపగలను.

మాండూక్య తైత్తిరీయ ఐతరేయ ఛాందోగ్యోపనిషత్తులు నరసాపురం శ్రీమాన్ న్యాయవేదాంతవిద్యావాచస్పతి తెలికచర్ల కందాడ రామానుజాచార్యులవారి దివ్యసన్నిధిని జదివితిమి. తర్క వేదాంత వ్యాకరణ మీమాంసాశాస్త్రములయందు వీరికి గల యఖండపాండిత్యము నే నెచ్చటను గని వినియెఱుగను. ఆ గారమునకు బరిమళమువలె వీరి యద్వితీయ పాండిత్యవిజ్ఞానములకు సౌలభ్యము వన్నె దెచ్చుచున్నది. మందసాసంస్థానమున పాతికశతాబ్ద మాస్థానపండితులుగా నుండి విరమించినపిమ్మట నాకొఱకై వీరు పుత్రికాసహితులై చెన్నపురికి విచ్చేసి యల్పజ్ఞులై యంధకారమున నుండిన మమ్ముల నాదరించి యుపనిషదర్థముల బోధించుటయే గాక భగవద్గుణానుభవము ననేకవిధముల గలిపి యనన్యసామాన్యమగు శ్రీభాష్యముసహితము బోధ గావించిరి. ఇమ్మహానుభావు కటాక్షానుగ్రహముల నేమని మేము గొనియాడగలము? 'చంద్రునకు నూలుపోగన్న చందము'గా ప్రేమపూర్వక నమస్కారములతో నాకు గల కృతజ్ఞతను దెలుపుచున్నాడను.

మైసూరియందు నే నున్నకాలమున సాక్షాత్తు ఎంబార్ల వంశస్థులగు మహావిద్వాంసులు బరోడా కళాశాలాపండితులు నగు శ్రీ ఎంబార్ కృష్ణమాచార్యులవారి సాన్నిధ్యము లభించెను. వారి యొద్ద బృహదారణ్యకోపనిషత్తు గొంతభాగము పఠింపగలిగితిని. వారిని దలచినపుడెల్ల వారికిగల స్వతంత్రవేదాంతజ్ఞానప్రాశస్త్యము

స్ఫురణకు రాక పూనదు. అట్టివారికి నమస్కృతి యొనర్చుటగూడ నా భాగ్య మనియే తలంచెదను.

1944 సంవత్సరమున మైసూరినుండి చెన్నపురికి వచ్చిన పిమ్మట ప్రబంధపఠనసంకల్పము భగవంతు డనుగ్రహించెను. శ్రీమాన్ పండిత చక్రవర్తి (తిరుమల నల్లాన్) శ్రీనివాసరంగాచార్యులవారి దర్శనము తటస్థించెను. వీరు నా కాబాల్యపరిచితు లగుటంజేసి యత్యంతాదరముతో దివ్యవాయ్ మొழி కాలక్షేపానందము నా కొసంగి నాకృతజ్ఞత కెంతయు పాత్రులైరి. వీరి యనుగ్రహమున 'తిరువాయ్ మొழி' మహాప్రబంధము పఠింపగలిగితిని. ఈ శ్రీముఖసూక్తిగ్రంథమునకు వీరు నాకు గలుగజేసిన ప్రబంధజ్ఞానమే కారణము. ప్రస్తుతము వీరి యనుగ్రహమున 'పెరియాళ్వార్ తిరుమొழி' సేవించుచున్నాడను. వీరియందు నాకు గల కృతజ్ఞతకు నా నమస్కారపూర్వకవందనములు. వీరు ప్రస్తుతము మద్రాసు సింగముసెట్టి యతీంద్రులుసెట్టి ధర్మస్థానమున కాలక్షేపస్వామిపదవి నలంకరించుచు జెన్నపురమునందలి యాంధ్రులకు సంస్కృత ద్రావిడ వేదాంతగ్రంథములంగూర్చి యుపన్యసించుచున్నారు.

విసువు విరామము లేక ముద్రణాపత్రము లత్యంతప్రీతితో దిద్ది గ్రంథముద్రణమున నా కెంతయుసహాయ మొనర్చిన శ్రీశతావధాని, విద్వాన్ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రులవారికి నా కృతజ్ఞతా వందనములు.

మదరాసు,
మార్చి, 1948

బ. పా.

# కృతజ్ఞత

గీత రచియించి నాకేత - త్కీర్తి నొసగి
ఈశ కేన కఠ ప్రశ్న - లెరుగ బల్కి
ముండకోపనిషత్తును - బూర్తిచేసి
యటులె మాండూక్య తైత్తిరీ - యైతరేయ
ముల ననువదించి ఛాందోగ్య - మును రచించి
యన్నిటికి గ్రంథకర్త నే - నైనయట్లు
పేరు నా కొసంగియును దృ - ప్తిసి వహింప
కిపుడు శ్రీముఖసూక్తి వ్రా - యించికొంటి
విట్టి నీచిద్విలాసంబు - తెలుసగదర మొ
యెల్లయపు డిట్టిదయనె న - న్నేలుకొనుము !

*　　　*　　　*

కలదుగా బృహదారణ్య - కం బొకండు
పరమసత్కీర్తి గన్న శ్రీ - భాష్య మొండు
ద్రావిడంబున మూడువే - దంబు లొండు
నెట్లు వ్రాయింతువో వీని - నింకమీఁద.



నమ్మాఴ్వార్ తిరువాయ్ మలర్న్దరుళియ

# తిరువాయ్మొఴి

## తనియన్గళ్

నాథమునిగళరుళిచ్చెయ్దదు

భక్తామృతం విశ్వజనానుమోదనం
సర్వార్థదం శ్రీశఠకోపవాఙ్మయమ్,
సహస్రశాఖోపనిషత్సమాగమం
నమామ్యహం ద్రావిడవేదసాగరమ్.

ఈశ్వరమునిగళరుళిచ్చెయ్దదు

తిరువఴుది నాడెన్ఱుమ్ తెన్కురుగూరెన్ఱుమ్,
మరువినియ వణ్పొరున లెన్ఱుమ్,—అరుమఱైక
ళన్దాది శెయ్దానడియిణైయే యెప్పొఴుదుమ్,
శిన్దియాయ్ నెంజే తెళిన్దు.

శొట్టైనమ్బిగళరుళిచ్చెయ్దదు

మనత్తాలుమ్ వాయాలుమ్ వణ్కురుగూర్ పేణుమ్,
ఇనత్తారై యల్లాదిఱైంజేన్,—తనత్తాలు
మేదుఙ్కుఱైవిలే నెన్దైశడకోపన్,
పాదఙ్గళ్ యాముడైయ పఱ్ఱు.

## XXXII

అనన్తాఴ్వానరుళిచ్చెయ్దదు

ఏయ్న్దపెరుఙ్కీర్త్తి యిరామానుశమునితన్ ,
వాయ్న్దమలర్ప్పాతమ్ వణంగుకిన్ఱేన్,—ఆయ్న్దపెరుం,
శీరార్ శడకోపన్ శెన్దమిఴ్ వేదన్దరిక్కుమ్,
పేరాద వుళ్ళమ్పెఱ.

భట్టరరుళిచ్చెయ్దవై

వాన్తిగఴుఞ్జోలైమదిళరఙ్గర్ వణ్పుకఴ్మేల్,
ఆన్ఱ తమిఴ్మఱైగ ళాయిరముమ్,—ఈన్ఱ
ముతఱ్ఱాయ్ శడకోపన్ మొయ్మ్బాల్ వళర్త్త,
ఇతత్తా యిరామానుశన్,
మిక్క విఱైనిలైయుమ్ మెయ్యా ముయిర్నిలైయుమ్,
తక్క నెఱియుమ్ తడైయాగి—త్తొక్కియలుమ్,
ఊఴ్వినైయుమ్ వాఴ్వినైయు మోదుఙ్కురుగైయర్కోన్,
యాఴినిశై వేదత్తియల్.



# సమర్పణము

జ్ఞాన మనువెన్న పాత్రలో - గ్రాఁగబెట్టి
భక్తిచక్కెరపాగున - భద్రపరచి
మహితగుణుఁ డగు శఠకోప - మౌని చేయు
మోక్షపుమిఠాయి తిరువాయి - మొఴి యనఁగ

* * *

అట్టి యుత్తమ గ్రంథంబు - ననువదింప
బరమదయ యుంచి మాసతీ - పతులయందు
నన్నుఁ గలముగాఁ గొని యబ్జ - నాభుఁ డిపుడు
వ్రాసె శ్రీముఖసూక్తి శు - భప్రదోక్తి

* * *

నిశ్చలం బగుమానస - నియతి లేక
భక్తియును లేక జ్ఞానసం - పదయు లేక
యుండుమమ్ముల నీరీతి - నుద్ధరించె
నీ కటాక్షంబెగాదె ని - ర్హేతుకంబు

# తిరువాయ్ మొఴి

## ముదల్ పత్తు

## ముదల్ తిరువాయ్ మొఴి

( మూలమ్ )

ఉయర్వఱ వుయర్నల
　　ముడైయవన్ యవ నవన్,
మయర్వఱ మదినల
　　మరుళినన్ యవ నవన్,
అయర్వఱు మమరర్గ
　　ళదిపతి యవ నవన్,
తుయరఱు శుడరడి
　　తొఴుదెఴున్ మననే! 1.

# శ్రీ ముఖ సూక్తి

## ప్రథమ శతకము

## ప్రథమ దశకము

(పరత్వ నిర్ణయము)

అతిశయంబులకెల్ల న - త్యధిక మైన
యతిశయం బగునానంద - మాశ్రమముగ
గల్గి భాసించు నమ్మహా - ఘను డెవండో

*   *   *

జ్ఞానశూన్యత, యన్యశే - షత్వ బుద్ధి,
దనకు దా నీశ్వరుడ నను - తలపు గనుట
యిట్టియజ్ఞానముల నశి - యింపజేసి,
పొదుగు పట్టనిక్షీరంబు - భూమిమీద
గార్చుధేనువువలె గటా - క్షంబు పొంగ
భక్తిరూప మహాజ్ఞానంబు - పరగునట్లు
కరుణ నామీద జల్లు ర - క్షకు డెవండో

*   *   *

భగవదనుభవానందసం - బంధమందు
భంగ మనియెడుమరణం బె - రుంగనట్టి
నిత్యసూరుల బాలించు - నేత యెవడొ
అట్టి పరమపూరుషుని స - ర్వార్తిహరము
లైన దేదీప్యమాన పా - దారవింద
ములనె సర్వదా యాశ్రయం - బుగ దలంచి
సల్పుమీ జీవనము మాన - సంబ! నీవు 1.

మననగ మలమఱ
మలర్మిశై యెఴుతరుమ్,
మననుణ ర్వళవిలన్
పొఱియుణ ర్వవై యిలన్,
ఇననుణర్ ముఴునల
మెదిర్నిగఴ్ కఴివినుమ్,
ఇననిల నెననుయిర్
మిగునరై యిలనే. ౨.

ఇలనదు వుడైయని
దెననినై వరియవన్,
నిలనిడై విశుమ్బిడై
యురువిన నరువినన్,
పులనొడు పులనల
నొఴివిలన్ పరన్ద, అన్
నలనుడై యొరువనై
నణుగినమ్ నామే. ౩.

మనసు నంతర్ముఖంబుగా - మరలజేసి
మలినము లగు కామాదుల - మాపుసేయు,
వెలిగి వికసించి పైపైకి - మొలకలెత్తు
మానసికపు జ్ఞానంబుచే - గాన దగిన
ప్రత్యగాత్మకు సము డైన - వాడు కాడు

* * *

ఇంద్రియంబుల శక్తిచే - నెరుగదగిన
భౌతికపదార్థములవంటి - వాడు కాడు

* * *

అట్లు చిదచిద్విలక్షణుం - డగుటగాక
జ్ఞానమయమూర్తిగా ప్రకా - శంబు గాంచు

* * *

మరియు నిరతిశయానంద - మయు డతండు

* * *

జరుగుచున్నట్టి, జరిగిన - జరుగనున్న
కాలములయం దతనికంటె - ఘనుడు లేడు
మరియు దొరకడు వాని స - మానుడేని

* * *

ఇవ్విధంబున నాత్మల - కెల్ల నాత్మ
పరమపూరుషుడే నాకు - ప్రాణ మెపుడు 2.

ఒండు గలవా డటంచు వే - రొండు లేని
వా డటంచు దలంపంగ - వలను పడదు
అది పరిచ్ఛిత్తి యల్పత్వ - మనెడు దోష
ముల నెరుంగని నిత్య వి - భూతి యగుట ;

* * *

అవనిక్రిందిపాతాళంబు - లాది గాగ
బరమపదమున కీవలి - వైపువరకు
వెలుగు సర్వలోకములయు - చిత్పదార్థ

నామవ నివనువ
    నవళివ ళువళెవళ్,
తామవ రివరువ
    రదువిదు వుదువెదు,
వీమవై యివైయువై
    యవైనల తీఙ్గవై,
ఆమవై యాయవై
    యాయ్ నిన్ఱ వవరే. 4.

అవరవర్ తమతమ
    దఱివఱి వగైవగై,
అవరవ రిఱైయవ
    రెనవడి యడైవర్గళ్,
అవరవ రిఱైయవర్,
    కుఱైవిల రిఱైయవర్,
అవరవర్ విదివఴి
    యడైయ నిన్ఱనరే. 5.

చిత్పదార్థాళికెల్లను - శేషి యగుచు,
జగతి నింద్రియములకు గో - చరము లైన
వస్తువులప్రత్యణువునందు - వ్యాప్తి జెంది,
వాని సుఖదుఃఖములకు సం - బంధపడని
దేవు నానందమయు నద్వి - తీయు జేర
గల్గితిమి యిట్టి దాశ్చర్య - కరము గాదె 3.

మనము వాడు వీడు - మధ్య నుండెడివాడు
నామె యీమె నడిమి - యామె యేమె
తమరు వారు వీరు - దాపున నున్నవా
రదియు నిదియు నడిమి - యదియు నెదియు
ఇచట నున్నయవియు - నివియు మధ్యవియును
నవియు మంచిచెడ్డ - లనెడియవియు
జరిగినవియు మరియు - జరగబోవునవియు
అన్ని యతడె యంత - రాత్మ యగుట 4.

జగతి సాధారణంబుగా - జనులయందు
వారివారికి జ్ఞానాను - సారము లగు
మతములం, దమయిష్టదే - వతలె దమకు
ఫలము లొసగెడువా రంచు - దలచి, వారి
పాదముల జేరి చేతు రు - పాసనములు

* * *

ఐన నాయిష్టదైవంబు - లాశ్రయించు
నట్టి భక్తులకోర్కుల - ననుసరించి,
ఫలము లిచ్చుటలో సమ - ర్థు లగునట్లు,
పరమపురుషుండు వారిలో - పల వసించి,
ఎవ్వ రెవ్వ రేవిధముగా - నెంచి పూజ
సేతురో? వారికెల్ల వి - శిష్టరీతి
ఫలముల నొసంగు దానె యు - పాస్య మగుచు 5.

నిన్ఱన రిరున్దనర్ కిడన్దనర్ తిరిన్దనర్,
నిన్ఱిల రిరున్దిలర్ కిడన్దిలర్ తిరిన్దిలర్,
ఎన్ఱుమో రియల్విన రెననినై వరియవర్,
ఎన్ఱుమో రియల్వొడు నిన్ఱవెన్ తిడరే. ౫.

తిడవిశు మ్బెరివళి నీర్నిల మివైమిశై,
పడర్పొరుళ్ ముఴువదుమా యవైయవై తొఱుమ్,
ఉడన్మిశై యుయిరెనక్ కరన్దెఙ్గుం పరన్దుళన్,
శుడర్మిగు శురుదియు ళివైయుణ్డ శురనే. ౭.

లోకమున నిల్చుటయును గూ – ర్చుండుటయును
పండుకొనుటయు దిరుగుచు – నుండుటయును
వివిధరీతులు గలవు ప్ర – వృత్తివిధులు ;
నిల్వకుండుట కూర్చుండ – నేర కుంట
పండుకొనకుంట తిరుగక – యుండుట యన
వివిధములు గాగ జెలగు ని – వృత్తివిధులు ;
ఈ ప్రవృత్తి నివృత్తుల – నెల్లయపుడు
దాల్చి చేతనాచేతన – తతి చరింప
గల్గుటయును నా స్వామి సం – కల్పముననె.

* * *

ఎవ్విధమున నతనిచర్య – లిట్టి వనుచు
నెరిగి వచియింపగా రా ద – దెవ్వనికిని ;
అతడు లోకవిలక్షణం – బగు స్వభావ
యుతు డటం చని దెల్పు వే – దోక్తులెల్ల ;

* * *

లోకమందు బదార్థస్వ – రూపములును
చర్యలును వానిసంకల్ప – సంభవములె ! 6

అవని జల మగ్ని వాయువు – నాకసంబు
ననెడి యైదిట గల్గు ప – దార్థసమితి
దానె యని చెప్పునట్లుపా – దానకార
ణం బగుటెగాక ; మనశరీ – రంబునందు
ఆత్మ స్వామిగా వ్యాపించు – నట్లు వస్తు
బృందమున నెల్లయెడల వ్యా – పించియుండు ;

* * *

శురరఱి వరునిలై విణ్ముదల్ ముఴువదుమ్,
వరన్ముద లాయవై ముఴుదుణ్డ పరపర఩్,
పురమొరు మూన్ఱెరి త్తమరర్క్కు మఱివియన్దు
అరనయ నెన వులగఴి త్తమై త్తుళనే. ౭

ఉళనెని లుళనవ నురువమి వ్వురువుగళ్,
ఉళనల నెనిలవ నరువమి వ్వరువుగళ్,
ఉళనెన విలనెన వివైగుణ ముడైమైయిల్,
ఉళనిరు తగైమైయో డొఴివిల఩్ పరన్దే. ౮

ఇట్లు సర్వవస్త్వంతర్బ - హిః ప్రదేశ
మందు వ్యాపించి తేజోమ - యంబులైన
వేదవాక్కుల జగతికి - వేద్యు డగుచు

* * *

ప్రళయమున మ్రింగి పిమ్మట - ప్రభవ మొసగి
స్థితిని గలిగించి జగతి ర - క్షించు నతడె. 7

బ్రహ్మ మొదలగు సర్వదే - వతలకేని
స్థితి యెఱుగరాని మూలప్ర - కృతికి ముఖ్య
కారణం బౌచు సృష్టించి - కడకు దాని
నేకకబళంబుగా భుజి - యింప గల్గు
ప్రళయకాలాంతకుం డాప - రాత్పరుండు

* * *

త్రిపురసంహార మొనరించి - త్రిభువనముల
హారణ మొనరించురుద్రాంత - రాత్మ యగుట,
దేవతలకెల్ల జ్ఞానసం - తృప్తి గలుగ
జేయువాడును జగతికి - సృష్టికర్త
యైన బ్రహ్మదేవున కంత - రాత్మయగుట,
నాతడే బ్రహ్మ, రుద్రుండు - నాతడె యగు. 8

ఉన్నవా డన్నచో నాత - డున్నవాడె;
యీ ప్రకాశించుజగతియం - దెల్ల స్థూల
వస్తురూపంబు లతనిరూ - పములె గాన;

* * *

ఉండలే దన్నగాని వా - డున్నవాడె;
జగతిదృష్టి కగమ్యగో - చరములైన

పరన్దతణ్ పరవైయుళ్ నీర్ తొఱుం పరన్దుళన్,
వరన్దవ ణ్డమిదెన నిలవిశు మ్బొఴివఱ,
కరన్దశి లిడన్దొఱు మిడ న్దికఴ్ పొరుడొఱుమ్,
కరన్దెఙ్గుం పరన్దుళ నివైయుణ్డ కరనే. ౧౦

వ స్తువులయ ప్రకాశస్వ - భావరూప
ములను వాని సూక్ష్మాకార - ము లగుగాన;

* * *

కనుక నుండుట లేకుంట - గా వచింప
బడుట వానిగుణంబు లై - పరగుకతన
భావమును నభావంబు నా - బరగునట్లు
రెండువిధముల నతడు వ - ర్తించు చుండు;

* * *

అన్నిటను గల్గు నాతని - వ్యాప్తి, యెందు
లేదు దాని కెన్నడును వి - చ్ఛేదనంబు; 9
చలువ వెదజల్లి యీ ప్రపం - చంబుచుట్టు
వ్యాపకం బై నజలనిధి - యణువులందు
నన్నిటనుగూడ నాతండు - వ్యాప్తి నెందు.

* * *

ఆకసముకంటె సర్వలో - కాళికంటె
ఎంతయో పెద్ద యైన స - ర్వేశ్వరుండు
ఇట్టి పరమాణువుల జొచ్చు - టరుదు గాదె
యనగ జెల్లదు; వా డిట్టి - యణువునందె,
యతివిశాలమా బ్రహ్మాండ - మందువలెనె
పరగు మిక్కిలి సూక్ష్మరూ - పము ధరించి;

* * *

అట్టులే భూమి యాకాశ - మాది యైన
భూతమండలిప్రత్యణు - వున నతండు
సూక్ష్మరూపంబుధరియించి - చొచ్చియుండు

* * *

కరవిశు మ్బెరివళి నీర్ నిల మివైమిశై,
వరనవిల్ తిఱళ్ వలి యళి పొఱైయాయ్ నిన్ఱ,
పరనడి మేఱ్కురు గూర్చ్చడకోపన్ శొల్,
నిరనిఱై యాయిర త్తివై పత్తుమ్ వీడే. ౧౧

సూక్ష్మవస్తువులం దతి - సూక్ష్మము లగు
క్షుద్రకాయంబులందును - జొచ్చునతడు

* * *

స్వయముగా బ్రకాశించెడు - సత్పదార్థ
ము లగుజీవులయందు లో - పల వసించి
తనయునికి వానికిం దెలి - యనివిధమున
వ్యాప్యములకును దెలియని - వ్యాప్తిచెందు.

* * *

అట్లు తన శరీరంబు లౌ - నఖిలవస్తు
జీవసంతతి తనయందె - సేర్చుకొనును
బ్రళయకాలంబునం దాప - రాత్పరుండు;
ధృతము లగుప్రమాణముల సి - ద్ధించువాడు; 10

ధరణి దానిస్వభావ మౌ - ధారకతయు
దహనుడును వానినై జంపు - దాహకతయు
జలము,దానికి సాజమౌ - చల్లదనము
వాయువును దానిగుణ మగు - బలము, నాక
సమును దానిస్వభావ మౌ - శబ్దగుణము
అన్నిటికిని నంతర్యామి - యగుచు, దానె
యన్ని యనదగు సర్వేశ్వ - రాంఘ్రి యుగము
నకు సమర్పించు నా తిరు - నగరవాసు
డైన శఠకోపమౌని శ - బ్దార్థసంయు
తంబుగా రచించిన సహ - స్రంబునందు
ప్రథమ దశకంబు పూరుషా - ర్థప్రదంబు. 11

## ముదల్ పత్తు

## ఇరణ్డామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

వీడుమిన్ ముఱ్ఱవుమ్,
వీడు శెయ్దు, ఉమ్ముయిర్
వీడుడై యానిడై,
వీడు శెయ్మినే. ౧

మిన్నిన్ నిలైయిల,
మన్నుయిరాక్కైగళ్,
ఎన్నుమిడత్తు, ఇఱై
యున్నుమినీరే. ౨

నీర్ నుమ దెన్ఱివై,
వేర్ ముదల్ మాయ్త్తు, ఇఱై
శేర్ మిన్, ఉయిర్క్కడ
నేర్ నిఱై యిల్లే. 3

## ప్రథమ శతకము

## ద్వితీయ దశకము



(ఉపదేశము)

భగవదితరమౌ విషయసం - బంధములను
వాసనలతోడ బూర్తిగా - వదలుకొనుము;

* * *

అట్లు ప్రతిబంధకనివృత్తి - యైనపిదప
ఆత్మలకునెల్ల నెవడు ని - యామకుండో
ఈశరీరంబులకు నెవ్వ - డీశ్వరుండో
పరమపదమున కెవ్వండు - స్వామి యగునొ
అట్టి సర్వేశ్వరునివస్తు - వైనయాత్మ
నాతనికె సమర్పించుభా - గ్యంబు గనుడు. 1

ఆత్మవాసం బొనర్చు కా - యంబులెల్ల
మెరుపుకంటెను మిగుల న - స్థిరము లగుట
వానియల్పత్వ మస్థిర - త్వము నొకింత
మనమునకు దెచ్చి యోజించు - కొనుడు మీరె. 2

ఆత్మ దేహం బనెడిభ్రాంతి - యమరి యుంట
ఈశ్వరుండను నే నని - యెడితలంపు
ఇట్టియపురుషార్థముల వ - హించుకతన
నే ననుస్వతంత్రబుద్ధి - జనించుచుండు;
మహిని సర్వంబు నీశ్వర - మయము గనుక
నాది యనుమమకారం బ - నర్థదంబు;

ఇల్లదు ముళ్ళదుమ్,
అల్ల దవనురు,
ఎల్లై యి లన్నలమ్,
పుల్గు! పఱ్ఱఱ్ఱే. ౮

అఱ్ఱదు పఱ్ఱెనిల్,
ఉఱ్ఱదు వీడుయిర్,
శెఱ్ఱదు మన్నుఱిల్,
అఱ్ఱిఱై పఱ్ఱే. ౯

పఱ్ఱిల ఈశనుమ్,
ముఱ్ఱవుమ్ నిన్ఱనన్,
పఱ్ఱి లైయాయ్, అవన్
ముఱ్ఱి లడఙ్గే. ౧౦

ఈయనర్థంబులను రెంటి - నిపుడె మీరు
వేరుతోడనే పెకలించి - విడిచి వైచి
చెడిననావ తీరంబునం - జేరినట్లు
స్వామియాశ్రయమును బొంద - బరుగు లిడుడు

*　　*　　*

అఖిల సంసారులకు నాత - డౌషధంబు
ఆత్మలకు వానివంటిశ్రే - యస్కరుండు
కలుగ డన్న చో నధికుండు - కలుగునొక్క! 3

వానిరూపం బచేతన - వస్తువులను
చేతనపదార్థములను మిం - చినది సుమ్మి!
బాహ్యసంబంధముల నెల్ల - వదలిపెట్టి
అసమస్తకల్యాణగు - ణాన్వితునకు
శరణ మొనరించి వానియా - శ్రయము గొనుడు. 4

ప్రకృతిసంబంధములు మిమ్ము - బాసె నన్న
ఆత్మసందర్శనము ప్రాప్త - మైనయట్లె
దానినే యంద్రు కైవల్య - ధామ మనుచు;

*　　*　　*

అంతకంటెను శ్రేయస్క - రార్థలాభ
మంద దలచెదరేని మీ - రాత్మరూప
దర్శనము క్షుద్ర మగుట న - ద్దాని విడిచి
భగవదితరసంబంధము - ల్బారదోలి
స్వామినే గోరి వానియా - శ్రయము గొనుడు. 5

ప్రేమరూపు డౌగాన స - ర్వేశ్వరుండు
సంగ మనునది వాని వా - సస్థలంబు
కనుక సర్వభూతసముండు - గా జెలంగు

*　　*　　*

అడఙ్గెఴిల్ శమ్బత్తు,
అడఙ్గక్కణ్డు, ఈశ
నడఙ్గెఴి లఃతెన్ఱు,
అడఙ్గుగ వుళ్ళే. ౮

అతనితో నీవు సంగంబు - నభిలషించి
ఆతడే సర్వ మను జ్ఞాన - మభ్యసించి
సర్వ విధసేవ లతనికి - సలుపవలయు

*     *     *

(నిర్మలులు గాగ దనసీమ - నిలిచియున్న
నిత్య సూరులపై ప్రేమ - నిలుప నేల?
జగతి మోహాంధులై వినా - శంబు నొందు
భూరియజ్ఞాను లగువారి - బ్రోవ వలదె?
యనుచు వైకుంఠు డమరుల - యందు రక్తి
మాని వాత్సల్యమును దాల్చు - మనుజులందు). 6

ఇందు నందును వైకుంఠ - మందుగూడ
జెలగు నుభయ విభూతుల - చెలువ మెల్ల
నీశ్వరుని వైభవంబుగా - నెఱగవలయు;
ఈ విధంబుగ నిద్దాని - నెరిగి నీవు
దాన నొకభాగ మే నను - తలపు జెంది
పాత్రుడవు గమ్ము వాని సం - బంధమునకు;

*     *     *

కడలిలోపల గల జీవ - గణము లెల్ల
కడలిలోనన సర్వ సౌ - ఖ్యంబులందు;
కడలిసంబంధ మెఱుగని - కట్టెపుల్ల
నైన నత్తరంగశ్రేణి - యవల ద్రోయు;
అట్టె స్వస్వామిసంబంధ - మరయు డేని
వాని వస్తువవై ముక్తి - వడయుగలవు. 7

ఉళ్ళమురై శెయల్,
ఉళ్ళ విమ్మూన్ఱైయుమ్.
ఉళ్ళిక్కెడుత్తు, ఇఱై
ఉళ్ళిలొడుఙ్గే. ౮

ఒడుఙ్గ వవన్కణ్,
ఒడుఙ్గలు మెల్లామ్
విడుమ్, పిన్ను మాక్కై
విడుమ్బొఴుదెణ్ణే. ౯

ఎణ్బెరుక్కన్నలత్తు,
ఒణ్బొరుళీఱిల,
వణ్బుగఴ్ నారణన్,
తిణ్కఴల్ శేరే. ౧౦

బాహ్యవిషయుక మైన ప్రా - వణ్య మొందు
మనము నంతర్ముఖంబుగా - మరల జేసి
పరమపురుషుని ధ్యానింప - బంచి తేని,
అట్టియానంద మంతంత - యగుచు బొంగి
వాక్స్వరూపంబు దాల్చి వె - ల్వలికి వచ్చు ;
బిదప భగవంతు చరణార - విందములకు
దాస్య మొనరింప గాయంబు - తత్తరించు;

*　　*　　*

ఇట్లు చరియింపవలసిన - ట్లీశ్వరుండు
సృష్టిచేసిన వీని చ - రించువిధము
చక్కగా జూచి యితరప్ర - సక్తి మాన్పి
స్వామియాశ్రయమున బ్రవే - శం బొనర్పు. 8

హృదయ వాక్కాయముల మూటి - నీశ్వరునకు
అర్పణ మొనర్ప, దత్ప్రాప్తి - నడ్డగించు
సకల విషయంబులును దామె - వికలము లగు ;

*　　*　　*

ఎల్లయజ్ఞానములకును - హేతువైన
యీ శరీరంబు విడిపోవు - టెప్పు డనుచు
కాచియుందువు పురుష సం - గంబు కొరకు
గాచి యువ్విళులూరెడు - కాంతవోలె; 9

స్వయముగా దమంతట బ్రకా - శంబు గనుచు
కరము నానంద మను జ్ఞాన - కాంతి గలిగి
గణుతి సేయంగ శక్యంబు - గాని యట్టి
జీవకోటులన్నిటికిని - శేషి యగుచు

శేర్తడ, త్తెన్కూరు
కూర్చ్చడకోపన్ శొల్,
శీర్తొడై యాయిరత్తు,
ఓర్తవిప్పత్తే. ౧౧



మొదల్ పత్తు

మూన్ఱామ్ తిరువాయ్ మొழி



( మూలమ్ )

పత్తుడై యడియవర్క్కెళియవన్
పిఱర్గళుక్కరియ
విత్తగన్, మలర్మగళ్ విరుమ్బు
నమరుమ్బెఱ లడిగళ్,
మత్తుఱు కడైవెణ్ణెయ్ కళవిని
లురవిడై యాప్పుణ్డు,
ఎత్తిఱ మురలినో
డిణైన్దిరు న్దేజియ వెళివే. ౧

నాశరహితకల్యాణగు - ణములకెల్ల
ఖనియనందగు నారాయ - ణుని సమస్త
సత్ఫలములిచ్చు దృఢతర - సాధనంబు
లైన పాదారవిందంబు - లాశ్రయింపు. 10

ఇల దటాక సమృద్ధమై - చెలగుచుండు
తిరునగరి నున్న శఠకోప - పరమహాని
స్వామి కల్యాణగుణపరం - పరలగూర్చి
కరుణ బల్కిన వేయిపా - శురములందు
... ది శుభా - ర్థప్రదంబు. 11




... థ మ శ త క ము

తృ తీ య ద శ క ము

(భక్తి)

(రామరావణ ఘోరసం - గ్రామమందు
లక్ష్మణస్వామి మూర్ఛిల్ల - రావణుండు
ఎత్తికొనిపోయి చెరబెట్ట - నెంచి, దగ్గ
రించి హస్తంబులెల్ల జో - డించియెత్త
మంచుకొండయొ మేరువో - మంధరంబొ
యన నచంచలుడయ్యె రా - మానుజుండు;
ఆంజనేయుండు రావణు - నవలద్రోసి
పరుగులిడివచ్చి దశరథ - పట్టికడకు

ఏకహస్తంబుతో బట్టి - యెత్తికొనియె;
పుష్పమాలిక నెత్తెడు - పోల్కి దోప

* * *

శత్రుమిత్రులపట్ల న - సాధ్యసాధ్య
భావములపూన్కి స్వామిస్వ - భావముగద)

* * *

భక్తి పురుషున కుత్తమై - శ్వర్య మగుట
లేశ మైన నయ్యది దృఢ - పాశమువలె
బరమపురుషు బొందుట సుల - భం బొనర్చు;
అతడు సులభుండు భక్తాళి - కగునుగాని
వానియాధారమును దలం - పకయె స్వప్ర
యత్న మొనరించువారి క - త్యంతదుర్ల
భుం డగుట గాకయుండు న - ద్భుతుడు నగుచు.

* * *

సర్వసౌరభములకు వా - సస్థల మగు
జలజమం దుద్భవించిన - సరసిజాక్షి
హృదయమును జూరకొనియెడు - నీశ్వరుండు

* * *

భక్తికంటెను వేఱైన - పథములందు
బడయ దుర్లభుం డగును నా - స్వామి యెపుడు

* * *

అవనిధరమును మోసి క్షీ - రాబ్ధి చిలికి
సుధను బంచిన యాజగ - త్సూత్రధారి,
గవ్యము ధరించి యొక గోప - కాంత కష్ట
పడి చిలుకువెన్న దొంగిలిం - పంగ, నురము

ఎళివరు మియల్వీన
నిలైవరమ్బిల, పలపిఱప్పాయ్
ఒళివరు ముఴునలమ్
ముదలిల కేడిల, వీడామ్
తెళితరు నిలైమైయ దొఴివిలన్
ముఴువదు మిఱైయోన్,
అళివరు మరుళినో డగత్తనన్
పుఱత్తన నమైన్దే.

అమైవుడై యఱనెఱి ముఴువదు
ముయర్వఱ వుయర్న్దు,
అమైవుడై ముతల్ కెడ లొడివిడై
యఱనిల మదువామ్,

త్రాటితోడుత బంధించి - రోట గట్ట
బెంగపడినట్లుగా వెక్కి - వెక్కి యేడ్చె ;
ఎట్టిసౌలభ్యమో దీని - నెరుగరాదు ;
తత్పరత్వంబునకు నేని - దరిశలిర్ప
నోవు; సౌలభ్యమున కుండ - నోపునొక్కొ ! 1

పరమసౌలభ్య మతని స్వా - భావికంబు ;
(సారథిత్వంబు వహియించు - సమయమున నె
విశ్వరూపంబుగూడ జూ - పించినట్టి)
అతని జన్మములకు నద్దు - నావు గలదె
అవి యసంఖ్యాకములు గాగ - నలరుకతన ;

* * *

అతని కల్యాణగుణము ల - నంతములుగ
సర్వకాలంబులం బ్రకా - శంబు గాంచు

* * *

ఆది యనునది లేక యం - త్యంబు లేక
భాసురం బైన జ్ఞానరూ - పము వహించు ;
బరమపదము నొసంగు స - త్పురుషు డతడు
అట్టి శక్తి స్వభావాదు - లతనివె కద !
వాడు చల్లనికృప జూపి - భక్తజనుల
కతి సమీపంబునం దుండి - కాచుచుండు ;
ఇతరులకు దూరముగ నున్న - గతి దనర్చు 2

ఫలములెల్లను బరిపక్వ - పరచు ధర్మ
మార్గములలోన నతిశయ - మహితు లగుచు,
అద్భుతము లైన సృష్టి ల - యములు మరి య
వాంతరవినాశము లగు వ్యా - పారములును

అమైవుడై యమరరుమ్
యావైయుమ్ యావరుమ్, తానామ్
అమైవుడై నారణన్ మాయైయై
యఱిపవర్ యారే. 3

యారుమోర్ నిలైమైయ నెన
వఱివరియ వెమ్బెరుమాన్,
యారుమోర్ నిలైమైయ నెన
వఱివెళియ వెమ్బెరుమాన్
పేరుమో రాయిరమ్
పిఱపలవుడైయ వెమ్బెరుమాన్
పేరుమో రురువము
ముళతిల్లై యిలతిల్లై పిణక్కే. ౪

పిణక్కఱ వఱువగై చ్చమయము
నెఱియుళ్ళి యురైత్త,
కణక్కఱు నలత్తన
నన్దమి లాదియ మ్బగవన్,
వణక్కుడై త్తవనెఱి వழிనిన్ఱు
పుఱనెఱి కళైకట్టు,

అతివిధేయత దమయాజ్ఞ - ననుసరింప,
జతురు లైన బ్రహ్మాది దే - వతలె గాక
సర్వచేతనా చేతన - సంతతియును
దనప్రకారంబు లగుటచే - దాన యనగ
నలరు నారాయణుని యనే - కావతార
గూఢచరితంబు లెరుగ శ - క్యం బెవండు ? 3

బహుసహస్రము ల్నామరూ - పముల గల్గి
వర్తన మొనర్చువాడు నా - స్వామియెగద
స్వప్రయత్నంబుచే నెంత - జ్ఞాను లైన
ఇట్టినైజంబువా డని - యెరుగరాని
సర్వ శక్తి సంయుతుడు నా - స్వామియెగద
శరణు చెందినవా డెంత - స్వల్పు డైన
దన స్వభావంబునెల్ల గ - న్గొనెడురీతి
జ్ఞాన మొసగెడువాడు నా - స్వామియెగద
అట్టి నాస్వామి కొకరూపే - రైనగాని
యాకృతియుగాని యుండలే - దని వచింత్రు
లేక యుండుట యెన్నడు - లే దటంద్రు
ఇట్లనాశ్రితు లాశ్రితు - లెల్లయపుడు
వాదము లొనర్చు చుందు ర - వారితముగ. 4

వేదబాహ్యంబు లైన ష - డ్విధమతముల
బాధలు శమింప, భక్తిప్ర - పత్తివిధుల
దెల్పుగీత వచించి బో - ధించువాడు ;
గణన కెక్కు డౌకల్యాణ - గుణసమూహ
ముల బ్రకాశించు నమ్మహా - పూరుషుండు ;
ప్రేమరూపంబు దాల్చి గా - న్పించువాడు ;

ఉణక్కుమిన్ పత్తైయుఱ
పవనుడై యుణర్వుకొ ణ్డుణర్న్దే. ౫

ఉణర్న్దుణర్ న్దిఴిన్దక
న్ఱుయర్న్దురు వియన్దవి న్నిలైమై,
ఉణర్న్దుణర్ న్దుణరిలు
మిఱైనిలై యుణర్వరి దుయిర్గాళ్,
ఉణర్న్దుణర్ న్దురైత్తురై
త్తరియయ నరనెన్ను మివరై,
ఉణర్న్దుణర్ న్దురైత్తురై
త్తిఱైఞ్జుమిన్ మనప్పట్ట దొన్ఱే. ౬

ఆమహాపూరుషుని యందు - నన్యభక్తి
నెరపి యడకువ వహియించి - పరపథముల
యెడల దృష్టు లన్కలుపుల - నెత్తివైచి
వానియెడల బ్రవృత్తితో - వానివిషయ
మైనజ్ఞానంబు బూని బా - హ్యంబులైన
విషయముల సమూలంబుగా - విడువవలయు. 5

దశదిశలనెల్ల వ్యాపించి - దనరునట్టి
ప్రాకృత పదార్థములకు వి - లక్షణంబు
గా వెలంగెడునాత్మ సా - క్షాత్కరింప
జేసికొన దగు, నిత్య మా - చింతనమున
జ్ఞానమున మననంబున - శ్రవణమునను ;

* * *

అంతమాత్రంబుచే నేమి -యైనయట్లు ;
పరమపురుషుని తత్త్వ స్వ - భావరూప
దర్శనము దానిచే బొంద - దగునె నరుడు?

* * *

కనుక చేతనులార ! మీ - మనమునందు
హరిహరబ్రహ్మ లనెడుత్ర - యంబులోన
రక్షకుం డెవ్వడో మరి - భక్షకుం డె
వండొ నాభి జనించిన - వా డెవండొ
తగుప్రమాణంబు లున్న శా - స్త్రముల జదివి,
యెవనియెడ పరత్వము నిర్ణ - యింపబడెనొ
చక్క నారయోజనల విమ - ర్శన మొనర్చి
మనమునకు బట్టువాని నో - క్కనిని గూర్చి

ఒన్ఱెన ప్పలవెన
వఱివరుమ్ వడివినుళ్ నిన్ఱ,
నన్ఱెఴిల్ నారణ్ణ్
నాన్ముగ నరనెన్నుమివరై,
ఒన్ఱను మ్మనత్తు వై
త్తుళ్ళి నుమ్మిరుపశై యఱుత్తు,
నన్ఱెన నలఞ్జెయ్ వ
దవనిడై నమ్ముడైనాళే. ౮

నాళునిన్ఱడునమ పఴమై
యఙ్గొడువినై యుడనే
మాళుమ్, ఓర్ కుఱైవిల్లై
మ్మనన గ మ్మలమఱ క్కఴువి,

శ్రవణ మనన తపంబు ల - చంచలముగ
జరిపి ధ్యానించి, వానినే - శరణు చొరుడు ! 6

ఒక్కఁడే యాత్మ మూఁడుగా నున్నదొక్కొ !
అట్లు గాకుండ మూఁడు కా - యంబులందు
వేరువే రాత్మ లీరీతి - జేరిరొక్కొ !
ఎఱుగ శక్యంబు గానట్లు - మెఱయుచున్న
యతులతేజోనిధి యనంగ - నఖిలలోక
రక్షకుం డైనయాదినా - రాయణుండు,
నిగమనాదంబు సర్వదా - నెరపుచున్న
వదనములు నాల్గు ధరియించు - వనజభవుఁడు,
లోకసంహార మొనరించు - రుద్రమూర్తి,
యన బ్రసిద్ధమై మూర్తిత్ర - యంబు చెలఁగు

*　　*　　*

వారివిషయంబు నిష్ఠతో - పాతబుద్ధి
బూని తర్కించుకొనుఁడు మీ - మానసమున

*　　*　　*

మూఁపురకును పరత్వంబు పొసఁగ దనియు
ఒక్కఁడే పరమాత్ముఁడై - యుండు ననియు
సర్వజన సుప్రసిద్ధ వి - షయము గాన
పురుషు లిద్వారం దీశ్వర - బుద్ధి మాని
పరమపురుషు నెరింగి స - ద్భక్తి వాని
నాశ్రయింపుఁడు బ్రతికియు - న్నపుడె మీరు. 7

పరమపురుషునం దనుమాన - పడుట యనెడు
కల్మషము మనమందుండి - కడిగివైచి,
అనుదినము మనశ్రీమంతు - డైనస్వామి
పాదకమలంబులనె యాశ్ర - యం బొనర్చి,

నాళున న్తిరువుడై యడిగళ్ త
న్నలఙ్కழల్ వణఙ్గి,
మాళుమోరిడ త్తిలుమ్
వణక్కొడు మాళ్వదు వలమే. ౮

వల త్తన న్తిరిపుర మెరి త్తవ
నిడం పెఱత్తున్ది
త్తలత్తు, ఎழு తిశై ముగన్ పడై త్త
నల్లులకము న్తానుమ్
పులప్పడ, ప్పిన్ను న్త న్నులగ త్తి
లగ త్తన్ తానే
శోలప్పుగి, లివై పిన్నుమ్ వయిత్తఱు
విమై యవన్ తుయక్కే. ౯

దెరపి లేకుండ మనల బా - ధించుచున్న
క్రూరములును ననాదు లౌ - ఘోరపాప
సంచయము పాసి తొలగు త - క్షణమె; పిదప
నేకొరంతయు మన కుండ - దెప్పుడేని

*　　　*　　　*

మరణకాలమునందు న - మ్రత వహించి
పరమపురుషుని మనమునఁ - భక్తి దలచి
ప్రాణముల వీడునెడల శ్రే - యస్కరంబు; 8

కుక్షికుడివైపు త్రిపురాంత - కుని ధరించి
పొచ్చెమెందును లేనిసం - పూర్ణవిధిని
జగములకు సృష్టి చక్కఁగా సలిపినట్టి
నలువ నేగాక, తజ్జగం - బులనుగూడ
నతివిశాలంబుగా నాభి - యందు నిలిపి;

*　　　*　　　*

తనకడుపునందు బుట్టిన - తనయుసృష్టి
యైనలోకంబు లల్పంబు - లని తలపక,
భక్తులకు దర్శనానంద - పారవశ్య
మొసఁగి వారిని సంతృప్తి - నొందజేయ
నాత్మమాయచే స్వయముగా - నవతరించె;
ఎంత చెప్పిన, గుక్షి నం - తంత బెరుగు
నిట్టిగుణములు వర్ణింప - నెవరితరము;

*　　　*　　　*

తలపదలపంగ వ్యామోహ - దాయకములు
సంశయములు పొండనిమాన - సములు గల్గి 9

తుయక్కఱు మదియిల్ నన్ ఞానత్తు
ళమరరై త్తుయక్కుం,
మయక్కుడై మాయైగళ్
వానిలుం పెరియన వల్లన్,
పుయక్కరు నిఱత్తనన్
పెరునిల జ్కడన్ద నల్లడిప్పోదు,
అయర్ప్పిల నలరిణావన్
తవ్రువన్ వణజ్గువ నమర్ న్దే. ౧౦

అమరర్ గళ్ తొழுదెழ
వలైకడల్ కడైన్దవన్ తన్నై,
అమర్ పొழிల్ వళజ్కురు గూ
ర్చ్చడకోపన్ కుఱ్ఱేవల్ గళ్,
అమర్ శువై యాయిర
త్తవత్తిను ళివైపత్తుమ్ వల్లార్,
అమరరో డుయర్విల్ శె
న్ఱువర్ తం పిఱవియఞ్జిఱైయే. ౧౧

శుద్ధులగుచు బరిజ్ఞాన - సిద్ధులైన
దేవతానీకమునకును - దిగ్భ్రమంబు
గలుగ జేసెడునాశ్చర్య - కరవిచేష్టి
తములవా డవతారాద్భు - తములవాడు;

* * *

అట్టియాశ్చర్యములు వాని - యందు జూడ
నాకసముకంటె గొప్పవి - యై చెలంగు

* * *

ఈప్రపంచంబు సర్వంబు - నేకపాద
మునను గొల్చెడిఘనఘనా - ఘనసువర్ణ
కాంతియుతు మనోహరపాద - కమలములను
అన్యచింతల విడనాడి - యనవరతము
మరవక స్మరింతు మెత్తు న - మస్కరింతు
కరశిరంబులతో బట్టి - కౌగిలింతు; 10

అమరులకు జీవితాశ్రయ - మగువిధమున
బాలసంద్రంబు మథియించు - పరమపురుషు
గూర్చి వనమయం బగుకురు - కూరునగర
వాసశఠకోపరచితస - ద్వాక్యసేవ
యైనపద్యసహస్రంబు - నం తృతీయ
దశక మియ్యది; దీని నా - దరముతోడ
పఠన మొనరించువార ల - ప్పరమపదము
చేరి యచ్చట గలనిత్య - సూరులవలె
జననమరణాదిక్రూరబం - ధముల గనరు 11

## ముదల్ పత్తు

# నాలామ్ తిరువాయ్ మొழி



( మూలమ్ )

అఞ్జిఱైయ మడనారా
    యళియత్తాయ్, నీయుం ని
న్నఞ్జిఱైయ శేవలుమా
    యూవావె న్ఱెనక్కరుళి,
వెఞ్జిఱైప్పు ళ్ళుయర్త్తా
    ర్కెన్ విడుతూదాయ్ చ్చెన్ఱక్కాల్,
వన్శిఱై యిలవన్ వైక్కిల్
    వైప్పుణ్డా లెన్ శెయ్యుమో. ౧

## ప్రథమ శతకము

## చతుర్థ దశకము

(సందేశము)

సదుపకార మొనర్ప నా - సక్తి గలిగి
అంద మగురెక్కలను గల్గి - యతులవేగ
శక్తియుక్తురా లగుసార - సద్ద్విజంబ!

* * *

పక్షిరాజమ! నీవు నీ - భర్త గలిసి
విరహిణినై కృశియించునా - విధము గాంచి
స్వార్థ మిది యని మీ హృద - యమున దలచి
పాప మని నన్ను గనికరిం - పంగవలయు;

* * *

కఠినపక్షయుక్తుం డైన - గరుడు నెక్కి
ధ్వజముగా వానినే గల - స్వామికడకు
ఆర్త నైననాదూతవై - యరుగ జనుము;
నాపనుపుదాన వగుని న్న - నాదరించి
యతడు సుముఖుండు గాక నీ - యం దొకింత
ద్వేషమును బూని నిను జెర - బెట్టెనేని,
దాన నేచెడుంగును నీకు - దగులబోదు;

* * *

ఇల బరోపకారార్థమై - యేగువారి
కట్టికష్టంబులెల్ల శ్రే - యస్కరములు. 1

ఎన్ శెయ్య తామరైక్కణ్
 పెరుమానార్క్కెన్ తూదాయ్,
ఎన్ శెయ్యుమురైత్తక్కా
 లినక్కుయిల్గాళ్ నీరలిరే,
మున్ శెయ్ద ముఴువినైయాల్,
 తిరువడిక్కీఴ్ క్కుఱ్ఱేవల్
మున్ శెయ్య ముయలాదే
 నకల్వాదువో విదియినమే. ౨

విదియినాల్ పెడైమణక్కుమ్
 మెన్నడైయ వన్నఙ్గాళ్.
మదియినాల్ కుఱళ్ మాణా
 యులకిరన్ద కళ్వఱ్కు,
మదియిలేన్ వల్వినైయే
 మాళాదో వెన్ఱు, ఒరుత్తి
మదియెల్లా ముళ్ కలఙ్గి
 మయఙ్గుమా లెన్నీరే. ౩

సతులు పతులు నౌకోవెల - జంటలార!
పుండరీకాక్షు డైననా - పురుషుకడకు
నాకు దూతలై యరుదెంచి - నాయవస్థ
తెలుగ బల్కినయెడల, మీ - కేమిభయము
పరమకరుణయె మీస్వభా - వంబు గాదె!

*　　*　　*

అకట! నాపాపబాహుళ్య - మూది లేని
దగుటవలన నాస్వామిపా - దారవింద
సన్నిధిని జేరి స్వయముగా - సంతసమున
ఆంతరంగికసేవ చే - యంగనైతి;
సాధనాంతరముల బూన - శక్తిలేక
శరణు చొచ్చిన నన్నునా - దరణసేసి
తొలగద్రోయుట న్యాయ్యమై - తోచెనొక్కొ! 2

అతులితానందపరు లైన - హంసలార!
భాగ్యవశమున జేరి దం - పతులు గాగ
గలసి విహరించు నోమంద - గమనలార!

*　　*　　*

(శాస్త్రవిహితవివాహస - త్ఫలమువలన
సరసదాంపత్యములు మీకు - సంభవించె;
అట్లు గాకుండ నావివా - హంబు విధి న
తిక్రమించిన దాట నీ - తీరు గల్గె)
దీర్ఘముగ యోజన లొనర్చ - ధీయుతుండు;
వామనస్వరూపము దాల్చు - బ్రహ్మచారి;
భక్షుడై యుండుబలిచక్ర - వర్తియొద్ద

ఎన్నిన్రైక కణ్డిరఙ్గి
    యిదుతకా దెన్నాద,
ఎన్నిల ముగిల్వణ్ణ
    ర్కెన్ శొల్లి యాన్ శొల్లుకేనో,
నన్నిన్రైయినియవర్ కళ్
    తఙ్గాదె న్ద్రిరువాయ్ శొల్,
నన్నిల మగన్దిల్ గాళ్
    నల్ గుదిరో నల్ గీరో. ౪

మూఁడుపాదంబులకు జాలు - భూమి గోరి
స్వర్గమర్త్యము ల్జేకొను - వంచకుండు;
అట్టివానితోఁ జోయి యి - ట్లనుడు మీరు!

* * *

మతివిహీన నానాపాప - మతులితంబు
అనుభవమున నెన్నటికి నం - త్యంబు గాదు;
అనుచు దుఃఖించి యొక కాంత - స్వాంతమందు
దిగ్భ్రమము జెంది నిను గోరి - తిరుగుచుండె
గనుక రక్షింప రమ్ము శీ - ఘ్రం బటంచు. 3

నాస్వభావమృదుత్వగు - ణంబు లెరిగి
దయ యొకింతైన మనమున - దాల్ప కుండ
ఇట్లు విడిపింపరా దని - యెంచనట్టి,
యంతరుష్ణబహిశ్శీత - మైననీల
మేఘముం బోలుస్వామి స - మీపమునకు
ఏమివార్తలు పంపింతు - మీముఖమున!
ఎరిగియుండియు గరుణ వ - హింప డాయె

* * *

"మంచి దైనట్టియాఘ్రాణ - మించు కైన
నామెదరి నిల్వ దింక మీ - యండ నేని
నిలిచినను నిల్వ నగు"నని పలికి మీరు
వాచికం బిడుసుకృతంబు - పడయరమ్మ!

* * *

ఇంతమాత్రపువార్త మీ - రింద్రనీల
వర్ణశోభితు లగుక్రౌంచ - పక్షులార!
చెప్పెదరొ చెప్పరో నాకు - జెప్పరమ్మ! 4

నల్గిత్తాన్ కాత్తళిక్కుం
　　పొఴిలేఴుమ్ వినై యేఱ్కే,
నల్గత్తా నాగాదో
　　నారణనై క్కణ్డక్కాల్,
మల్గునీ ర్పునల్పడప్పై
　　యిరై తేర్వణ్ శిఱుకురుగే,
మల్గునీర్ కణ్ణేఱ్కోర్
　　వాశకఙ్గొణ్డరుళాయే. ౫

అరుళాద నీరరుళి
　　యవరావి తువరామున్,
అరుళాఴి ప్పుట్కడవీ
　　రవర్వీది యొరునాళెన్ఱు,

జలము పాఱెడువనపరి - సరములందు
ఆలుబిడ్డలరక్ష కా - హారవస్తు
నిచయసంపాదన మొనర్చు - నీరుగోడి!

* * *

పరు లపేక్షింపకయె యీప్ర - పంచ మెల్ల
సప్తభువనము లుక్కుక్షి ర - క్షణ మొనర్చి
పిదప సృష్టించి పాలనా - విధుల సలుపు
భారము వహించునట్టినా - స్వామి కిప్పు
డతనిసృష్టిలో నేకాంశ - మైననన్ను
బాపి ననువంక నిల్లెడ - బాయ దగునె?

* * *

(జగతి జనులకు జేయుర - క్షణకు నేని
కాంత నైయున్న నే నర్హ - గాకపోతి)

* * *

జీవనిచయస్వరూపంబు - స్థితి లయంబు
తన కధీనంబు లైయుండ - దా బ్రకారి
యగుచు వాని ప్రకారంబు - లుగ ధరించు
వానిలోపముల దన లో - పములుగాగ
జూచునారాయణుని నీవు - చూతు వేని,
కంట నీరిటిగా నీరు - గార్చునాకు
అతనికడనుండి యొక్కవా - ర్తైన దెమ్ము; 5
ప్రథితగాంభీర్యసౌందర్య - వంతమైన
తుమ్మెదా! నాదయాసము - ద్రు డగుస్వామి
గాంచినపు డిట్లు నామాట - గా వచింపు!

* * *

అరుళాఴి యమ్మానై
క్కణ్డకా లిదుశొల్లి
అరుళ్, ఆఴి వరివణ్డే
యాముమెన్ పిఴైత్తోమే. ౬

ఎన్ పిఴైకో ప్పదుపోల
ప్పనివాడై యీర్గిన్ఱ,
ఎన్ పిఴైయే నినైన్దరుళి
యరుళాద తిరుమాలార్క్కు,
ఎన్ పిఴైత్తాళ్ తిరువడియిన్
తగవినుక్కు న్ఱోరువాయ్ శొల్,
ఎన్ పిఴైక్కుమిళఙ్కిళియే
యాన్ వళర్త్త నీయలైయే. ౭

కరుణ మాలినమీరు మీ - కాంతయెడల
కొంతదయ యుంచి ప్రాణంబు - లంతరింప
కున్నయప్పుడె, సుగుణసం - పన్నుడైన
గరుడు నాయమ్మవీథివై - పరుగునట్లు
నడుపవలయును దుడ కొక్క - నాటనైన;
(పచ్చి యొకకొంత యైన గ - న్పట్టునపుడె
వాన వచ్చిన నుపయోగ - పడునుగాదె!)

*    *    *

ఇంతకును నామెయందు త - ప్పేమి గలదు. 6

చెల్వములప్రోగొనర్చెడి - చిలుకపిల్ల!
నిన్ను గాంచిన నామనో - నేత్రవిషయ
మైనసొబగెల్ల మనమునం - దావరించి
యెముకలం దాకి వానిని - హింసచేసె;
నీవు నే బెంచుచిలుకవు - గావె చెప్పుమ!

*    *    *

శల్యముల రంధ్ర మొనరించి - సరము గాగ
దారమున గ్రుచ్చె నన శీత - మారుతంబు
బాధ గలిగించు చున్నది - బహువిధముల

*    *    *

ఆదయారూపిణియగు లో - కైకమాత
తోడ విహరించుస్వామి నా - దోషములనె
తలపునం దుంచి దయమాలి - యులుక బూనె
గాని, దయ జూప ప్రతిబంధ - కంబులైన
తప్పు లే నేమి చేసితో - తలపు మనుము! 7

నీయలైయే శిఱుపూవాయ్,
నెడుమాలార్ కెన్ తూదాయ్,
నోయెనదు నువలెన్న
నువలాదే యిరున్దొఴిన్దాయ్,
శాయలొడు మణిమామై
తళర్న్దేన్ నాన్, ఇనియునదు
వాయలగి లిన్నడిశిల్
వైప్పారై నాడాయే. ౮

నాడాద మలర్నాడి
నాడోఱుమ్ నారణన్ తన్,
వాడాద మలరడిక్కీఴ్
వైక్కవే వగుక్కిన్ఱు,
వీడాడి వీఱ్ఱిరుత్తల్
వినైయఱ్ఱదెన్ శెయ్వదో,
ఊడాడు పనివాడా
యుఱైత్తీరా యెనదుడలే. ౯

నే ననుభవించుదుస్థితి - నిఖిలలోక
రక్షకుం డగుస్వామిస - మక్షమందు
విన్నప మొనర్పనైతివి - చిన్నిచిలుక!
ఇంతవరకును దెచ్చితి - విట్లు చేసి

*    *    *

దీప్తిమంత మై వెల్గు నా - దేహకాంతి
శ్లాఘ్య మై యొప్పునా మేని - చక్కదనము
క్రూరదురవస్థవలన బో - గొట్టుకొంటి;

*    *    *

ఇంక నీనోట రుచి యైన - యెరల దెచ్చి
ప్రీతితో బెట్టువారల - వెదకికొనుము ! 8

ఊర కటు నిటు సనుశీత - మారుతంబ!
వెదకినను దుర్లభము లగు - విరులబోలు
నాత్మపుష్పంబులను దెచ్చి, - యనుదినంబు
నిత్యపూజార్హ్యము లగు పె - న్నిధులవంటి
స్వామి నారాయణునిపాద - సరసిజముల
కర్పణముచేయవలయు నీ - యవయవములు

*    *    *

ఇట్లొనర్చు భాగ్యంబు నా - కెట్లు గలుగు!
కరము విశ్లేషబాధాగ్ర - గణ్యమైన
దుస్థితిని మున్గి యున్నయా - యస్థిరంపు
దేహ మేమి యై పోవునో - దెలియరాదు

*    *    *

(వానివిశ్లేషమున గల్గు - బాధతోడ
వానిసంబంధముం గాంచి - బంధువులును

ఉడలాఴి ప్పిఱప్పువీ
డుయిర్ ముదలాయ్ ముఱ్ఱుమాయ్.
కడలాఴి నీర్ తోఱ్ఱి
యదనుళ్ళే కణ్వళరుమ్,
అడలాఴియమ్మానై
క్కణ్డాక్క లిదుశొల్లి,
విడలాఴి మడనెఞ్జే
వినైయో మొన్ఱామళవే. ౧౦

అళవియన్ఱ వేఴులగ
త్తవర్ పెరుమాన్ కణ్ణనై,
వళవయల్ శూఴ్ వణ్ కురుగూ
ర్చ్చడకోపన్ వాయ్న్దురైత్త.
అళవియన్ఱ వన్దాది
యాయిరత్తు ళిప్పత్తిన్,
వళవురైయాల్ పెఱలాగుమ్
వానోఙ్గు పెరువళమే. ౧౧

విడిచిపోయిరి; నా కింక - వెరవు గలదె
రెంటికిం జెడిపోయి నే - నొంటి నైతి). 9

భవ్య మగుమానసమ! దేహ - బంధజనిత
జననమరణంబులకును మో - క్షంబునకును
వస్తు వగునాత్మ మొదలుస - ర్వము వహించి
అంతు లేనిజలాబ్ధి శ - యాను డగుచు,

* * *

శత్రుసంహారకం బైన - చక్రమును ధ
రించుస్వామిని నీవు ద - ర్శించినపుడు,

* * *

''అతనిపాదాబ్జయుగ్మంబు - నాశ్రయించి
సర్వకైంకర్యముల జేసి - జన్మ సార్థ
కంబు గావింప నాయాశ - యం'' బటంచు
బల్కవలయును; నే నెంత - పాపి నైన
స్వామితోడుత నన్ను సం - బంధపరచు
వరకు వానిసన్నిధి విడ - వలదు నీవు. 10

ఆది యంతంబు లేనివా - డఖిలలోక
చేతనులకెల్ల స్వామిగా - సేవ్యు డగుచు
బరమసులభు డౌ శ్రీకృష్ణు - పాదపూజ
నముగ నర్పించుటకు దిరు - నగరియందు
వాసమొనరించునమ్మాళు - వారు మిగుల
భక్తితో యోజనల బూని - వ్రాసినట్టి
సుగుణసంప్రద మైనపా - శురసహస్ర
మందు నాల్గవదశక మి - య్యది చెలంగు;

* * *

ముదల్ పత్తు

ఐన్దామ్ తిరువాయ్మొఴి



( మూలమ్ )

వళవేఴులగిన్ ముదలాయ
వానోరిఱైయై, అరువినైయేన్
కళవేఴ్వెణ్ణెయ్ తొడువుణ్డ
కళ్వావెన్బన్ పిన్నైయుమ్,
తళవేఴ్ముఱువల్ పిన్నైక్కాయ్
వల్లానాయర్ తలైవనాయ్,
ఇళవేఱ్ఱేఴ్ తఴువియ
ఎన్దాయెన్బన్ నినైన్దునైన్దే. ౧

ఎవరు సద్భక్తి నిది పఠి - యింపగలరో
వార లుత్తమమోక్షసం - పదను జెంది
శాశ్వతానందముం గని - స తసింత్రు. 11

## ప్రథమ శతకము

## పంచమ దశకము

### (పశ్చాత్తాపము)

లోపములు లేక యీ సప్త - లోకములకు
పుట్టువు నొసంగి లీలావి - భూతి గాఁగ
ననుభవించుచు వైకుంఠ - మందు నిత్య
సూరులకు స్వామి యౌ జగ - త్సూత్రధారి
పట్ల పాపి నౌనే నిట్లు - పల్క నగునె ?

* * *

ధ్యానమున నాశరీరంబు - తరుగ జేసి
వాని చౌర్యగుణంబెల్ల - బయలుపడగ
నంటి నవనీతచోరుఁ డం - చనెడిమాట
మరియు, మొల్లలయందంబు - మరుగుపరుప
జాలునప్పిన్నసతిమంద - హాసమునకు
దాసుడై యదునాయక - త్వము వహించి
యౌవనోద్భవదుష్టమ - దాంధము లగు
సప్తవృషభంబులను బట్టి - సరభసముగ

నిన్ఱనిన్ఱుళ్ కరన్ఱురగి
    ఇమైయోర్ పలరుమ్ మునివరుమ్,
పునైన్ఱ కణ్ణినీర్ శాన్ఱమ్
    పుకై యోడేన్ది వణజ్గినాల్,
నినైన్ఱవెల్లా ప్పొరుళ్గళుక్కుమ్
    విత్తాయ్ ముదలిల్ శిదైయామే,
మనఞ్జెయ్ ఞానత్తున్ పెరుమై
    మాశూణాదో మాయోనే. ౨

మాయోనిగళాయ్ నడైకఱ్ఱ
    వానోర్ పలరుమ్ మునివరుమ్,
నీయోనిగళై ప్పడై యెన్ఱు
    నిఱైనాన్ముగనై ప్పడైత్తవన్,
శేయోనెల్లా వఱివుక్కుమ్
    తిశైగళెల్లా న్దిరువడియాల్
తాయోన్, ఎల్లా వెవ్వుయిర్క్కుమ్
    తాయోన్ తానోరురువనే. 3

నలుగ గొట్టినయట్టి నా - నాథు డంటి

*　　*　　*

చనవు లీరీతి వానిపై - సలుప దగునె?　　1

ధ్యానమున బారవశ్యంబు - దనువు జెంద

మనసు కరగి ద్రవంబుగా - మారిపోవ

వనజభవు డాదిదేవత - ల్సనకు డాది

ఋషివరు లనేకు లరుదెంచి - ప్రియముతోడ

*　　*　　*

జలములను బుష్పమాలల - జందనముల

బలుఫలంబుల నగరుధూ - పముల నొసగి

వినయసాష్టాంగవిధుల సే - వించునెడల

*　　*　　*

లయము జెందినయాపదా - ర్థములకెల్ల

గారణం బౌచు నెట్టివి - కారములును

నీవు పొందక సృష్టించు - నేర్పరి వగు

నీమహత్త్వంబు మాయక - నిలుచుగాక!

అద్భుతములకు నాస్వామి - యాకరంబు.　　2

ఉన్నతము లగుజన్మంబు - లొంది సృష్టి

మొదలుగా గలవ్యాపార - ముల నెఱుంగు

వార లగుదేవతల ఋషీ - శ్వరుల బెక్కు

మందిని సృజింపు మనుచు బ్ర - హ్మను సృజించి

వాని కేలోపమును లేని - జ్ఞాన మొసగి,

జ్ఞానులకుగూడ దెలియంగ - రానివాడు

*　　*　　*

కువలయం బొక్కపాదాన - గొలుచువాడు

తానోరురువే తనివిత్తాయ్
త్తన్నిల్ మూవర్ ముతలాయ,
వానోర్ పలరుమ్ మునివరుమ్
మఱ్ఱుమ్ మఱ్ఱుమ్ ముఱ్ఱుమాయ్,
త్తానోర్ పెరునీర్ తన్నుళ్ళే తోన్ఱి
యదనుళ్ కణ్వళరుమ్,
వానోర్ పెరుమాన్ మామాయన్
వైకున్ద నెమ్పెరుమానే. ౮

మానేయ్ నోక్కి మడవాళై
మార్పిల్ కొణ్డాయ్ మాదవా,
కూనేశిదైయ వుణ్డైవిల్
నిఱత్తిల్ తెఱిత్తాయ్ కోవిన్దా,
వానార్ శోది మణివణ్ణా
మదుశూదా నీయరుళాయ్, ఉన్

ప్రాణిసంతతులకు దల్లి - వంటివాడు
చూడ, నాస్వామి యగుపురు - షోత్తముండె
పరమసౌశీల్య మగుస్వభా-వంబువాడు. 3
బ్రహ్మరుద్రాదు లనగ నె - వ్వరును లేని
యనాదికాలంబునం దొక్క - డగుచు నిలిచి
తా నుపాదానమును నిమి - త్తమును నగుచు
నట్లె సహకారమును దానె - యగుచు జగతి
సృష్టిసంకల్ప మొదలోన - జేసికొనెడి

* * *

సృష్టికర్త ప్రళయకర్త - స్థితికి గర్త
లనగ తనతోడ ముమ్మూర్తు - లను సృజించి
దేవతలు ఋషీశ్వరులును - స్థావరములు
జంగమములు నితరవస్తు - సంతతులును
అన్నిటిని సృష్టిసేసి తా - నైనవాడు

* * *

పరమపదనాథు డాశ్చర్య - కరగుణుండు ;
నిత్యసూరుల బాలించు - నేత ; నాకు
స్వామి గావున నే వాని - స్వత్వ మగుదు ;
విధిగ నను బ్రోచునాత డె - వ్విధిని నేని. 4
ఆత్మగుణలక్షణోపేత - హరిణనేత్ర
శ్రీమహాలక్ష్మినిం గొని - హృదయకమల
మధ్యవర్తిగ ధరియించు - మాధవుడవు
విల్లు దగ వంక దీర్చెడు - విధము దోప
కుబ్జవక్రత సరి సేయు - కోవిదుడవు

* * *

తేనేమలరు న్తిరుప్పాదమ్
  శేరుమాఱు విన్నై యేనే. ౫

విన్నై యేఁ విన్నైతీర్ మరున్దానాయ్
  విణ్ణోర్ తలైవా కేశవా,
మన్నై శేరాయర్ కులముదలే
  మామాయనే మాదవా,
శిన్నై యేయ్ తణ్డుழాయ మరామరఙ్గ
  శేత్తు నెయ్ దాయ్ శిరీదరా,
ఇన్నయాయిన్నయ పెయరినా
  నెన్జు నైవ నడియేనే. ౬

అడియేఁ శిఱియ ఞాన త్తే
  నడిదలాఱ్కు మరియానై,

ఇంద్రనీలమణిం బోలు - సాంద్రకాంతి
బరమపదమెల్ల బ్రభలతో - బర్వజేయు
శుద్ధసత్త్వాండ మగుమధు - సూదనుడవు

*　　　*　　　*

మధువు స్రవియించు, మోక్షసం - పద నొసంగు
నీపదాంభోరుహములస - న్నిధికి బరమ
పాపి నగునేను జేరెదు - భాగ్య మిమ్మ! 5

అఘమహారోగి నానాకు - నౌషధమవు
నిత్యసూరుల కానంద - నిధివి; బ్రహ్మ
కీశునకు గారణమ వైన - కేశవుడవు

*　　　*　　　*

గుడిసెలందు వసించెదు - గొల్లజనుల
నాయకుడ వౌదు వాశ్చర్య - నవ్యచేష్టి
తములకర్తవు మరి రమా - ధవుడ వీవు;

*　　　*　　　*

నిబిడశాఖావృతంబు లై - నిలిచియున్న
సాలవృక్షంబు లేడవ - లీల ద్రుంచి
చిరుతయాటల నాడిన - శ్రీధరుడవు

*　　　*　　　*

ఈస్వభావంబులం గల్గి - యిట్టినామ
ముల వహించెడుప్రఖ్యాత - పూరుషుడవు
క్రుంగి పోయెడునను జూడ - గూడదొకొ! 6

ఎట్టిజ్ఞానులకేని గ్ర - హింపరాని
యతిశయంబుల విలసిల్లు - నట్టివాడు;

కడిశేర్ తణ్ణన్తుఴాయ్ క్కణ్ణి
    పునైన్దాన్ తన్నైక్కణ్ణనై,
శెడియారాక్కై యడియారై
    చ్చేర్దల్తీర్క్కు న్తిరుమాలై,
అడియేన్ కాణ్బానలఱ్ఱువ
    నిదనిల్ మిక్కో రయర్వుణ్డే. ౨

ఉణ్డాయులకేఴ్ మున్నమే,
    యుమిఴ్న్దుమాయైయాల్ పుక్కు
ఉణ్డాయ్ వెణ్ణై శిఱుమనిశ
    రువలైయాక్కై నిలైయెయ్ది,
మణ్డాన్ శోర్న్ద దుణ్డేలుమ్
    మనిశర్క్కాగుంపీర్. శిఱిదుమ్
అణ్డావణ్ణ మక్కారైయ
    నెయ్యూర్ మరున్దో మాయోనే. ౩

మాయోన్ఱీయ వలవలై
    ప్పెరుమా వఞ్జప్పేయ్ వీయ,
తూయకుఴవియాయ్ విడప్పా
    లముదా వముదుశెయ్దిట్ట

సరసశృంగారశీతల - సౌరభముల
నించుతులసిమాలికల ధ - రించువాఁడు ;

* * *

గోపగోపీజనంబుఁ - గోర్కు లూర
లీల లొనరించు శ్రీకృష్ణ - బాలకుండు
భక్తులకు కర్మసంభవ - పాపదేహ
బంధముల బాపి ప్రోచు శ్రీ - వల్లభుండు

* * *

ఆమహామహు బొందుట - కల్పబుద్ధి
నయ్యు సర్వదా చింతింతు - నాశపడుచు. 7

సర్వకల్పనాచాతుర్య! - సరసిజాక్ష!
సప్తలోకము ల్మ్రింగెదె భో - జన మొనర్చి
పిదప వానిని సృష్టికై - వెడల గ్రక్కి
అల్పమానవజాతిదే - హంబు దాల్చి
గొల్లపల్లె మాయల జేయు - కొరకు జేరి
వంచకుడ వౌచు వెన్న భు - జించినావు!

* * *

పృథ్వినిం గ్రక్కి సృష్టి గా - వించునపుడు
మ్రింగినది కొంత లోపనే - మిగిలెనేని,
దానిచే పాండురోగంబు - దగులునేమొ
యంచు ముందుగా వెన్న భ - క్షించితౌర! 8

జగములెల్లను గాచుర - క్షకుని యెడల
బరచుదుర్బుద్ధి కామరూ - పము ధరించి
వంచన మొనర్చి మడియింప - నెంచి వచ్చు
పూతన స్తనంబులకు బూత - పూసి యున్న

మాయన్, వానోర్ తని_త్తలైవన్
మలరాళ్ మైన్ద నెవ్వుయిర్క్కుమ్
తాయోన్, తమ్మా నెన్నమ్మా
నమ్మామూ_ర్తియై చ్చార్న్దే. ౯

శార్న్దవిరువల్ వినైగళుం శరిత్తు
మాయ ప్పఱ్ఱఱుత్తు
_త్తీర్న్దుతన్బాల్ మనమ్వైక్క
_త్తిరు_త్తి వీడుతిరుత్తువాన్,
ఆర్న్దఞాన చ్చుడరాగి
యగలఙ్కీఴ్మే లళవిఱన్దు,
నేర్న్దవురువా యరువాగు
మివఱ్ఱుయిరాం నెడుమాలే. ౧౦

విషము నమృతంబునుం బోలె - బీల్చివైచి
చిటికెలో దాని ద్రుంచు - శిశురూప
చారి కంసారి! యద్భుతా - శ్చర్యకారి;
పరమపదమందె నిత్యని - వాసు లైన
యమరసంతతి కద్వితీ - యాధికారి
* * *
సిరులజవరాలిపతి, సర్వ - జీవకోటి
పోషణంబున దల్లిని - బోలుమూర్తి
* * *
తనకు దా స్వామి నాస్వామి - ధర్మకామి
దివ్యమంగళవిగ్రహా - దీప్తియుతుడు
వానితోడుత విశ్లేష - మేను బొంద
జాల, నయ్యది యాత్మనా - శంబు గాన. 9

నన్ను బాధించుపాపపు - ణ్యంబు లనెడు
ద్వివిధకర్మము ల్నాకు ని - వృత్తి చేసి,
విషయసంగాదిదుర్జ్ఞాన - విధుల మాన్పి,
నామనస్సు నిరంతరా - నందధామ
మైనతనయందె లయ మైన - య ట్లొనర్చి,
నా కొసంగెడుతనమోక్ష - నగరమందు
పూర్వశృంగారముల జేయ - మొదలుపెట్టె;
* * *
అట్టివా డెవ్వడో యని - యడుగ నేల?
సర్వపరిపూర్ణస్వప్రకా - శప్రభలకు
నాకరం బైనజ్ఞానరూ - పాన్వితుండు
* * *
సకలముఖముల వ్యాపించు - సత్పురుషుడు;

మాలే మాయప్పెరుమానే
మామాయనే యెన్ఱెన్ఱు,
మాలేయేఱి మాలరుళాల్
మన్నుకురుగూర్చ్చడకోపన్,
పాలేయ్ తమిఴిశై కారర్
పత్తర్ పరవు మాయిరత్తిన్,
పాలేపట్ట వివై పత్తుమ్
వల్లార్క్కిల్లై పరివదే. ౧౧

ముదల్ పత్తు

ఆఱామ్ తిరువాయ్ మొఴి

(మూలమ్)

పరివది లీశనైప్పాడి,
విరివదు మేవలుఱువీర్,
పిరివగై యిన్ఱి నన్నీర్ తూయ్,
పురివదువుం పుగై పూవే. ౧

స్థూలసూక్ష్మస్వరూపవ - స్తువు లనంగ
నలరు జీవనిర్జీవాంత - రాత్మ యతడు. 10

ఓ మహాత్మ! మహైశ్వర్య - యుతగుణాఢ్య!
అద్భుతానంతచేష్టక - ల్యాణసుగుణ
యన నిరంతరమును నసం - ఖ్యాకము లగు
నామముల నుచ్చరించి యా - నంద మొంది,
చిత్తవిభ్రాంతు డై పుర - షోత్తముని య
నుగ్రహము బొందు భక్తజ - నాగ్రగణ్యు
డైన కురుకూరు శఠకోప - యతివరుండు

* * *

ద్రవిడగాయకసద్భక్త - తతికి సంత
సంబుగా బల్కు నీ సహ - స్రంబునందు
దశక మొం డిది; దీని శ్ర - ద్ధను బఠించు
జనులు దుఃఖంబులను దాటి - సంతసింత్రు. 11

---

ప్రథమ శతకము

షష్ఠ దశకము

(ఆశ్రిత సులభత్వము)

పక్షపాతంబు లేక లో - పములు గనక
సకలప్రతిబంధకములను - సమయ జేయు
దేవు సామగానంబుచే - దృప్తిపరుప
గోరి పూజకు ద్రవ్యము - ల్గూర్ప జాల

మదువార్ తణ్ణన్దుழాయా౯,
ముదువేద ముదల్వనుక్కు.
ఎదువేదెన్పణియెన్నా
దదువే యాళ్చెయ్యుమీాడే. ౨

ఈడుమెడుప్పుమి లీశ౯,
మాడువిడా దెన్మనసే,

నట్టిచేతనులార! మీ - రంబుజాక్షు
పూజనద్రవ్యములకు వా - పోవ నేల!

*            *            *

పాదసన్నిధి జలము న - ర్పణ మొనర్చి
దారకుపుష్పంబు లర్పించి - ధూప మొసగి
యాచరింపుడు మీయిష్ట - యజనవిధుల

*            *            *

పరమసౌలభ్య మతని స్వ - భావ మగుట
అంతకే సర్వసంతృప్తి - నతడు చెందు. 1

అతిమనోహర పరిమళా - న్వితము లగుచు
జంద్రికా పద్మ మకరంద - సదృశ మైన
చలువ వెదజల్లు తులసిమా - లలు ధరించు
సిరులజవరాలిపతికి నే - జేయుసేవ
లేవి గల విందుగాని యిం - కెందుగాని;

*            *            *

ఆది లేని వేదంబుల - కాది యగుచు
సర్వభాగంబులం బ్రకా - శంబు గాంచు
పరమపురుషున కే జేయ - వలయుసేవ
లేవి గల విందుగాని యిం - కెందు గాని

*            *            *

ఈవిధం బగు తలపు వ - హింపకుంట
ఎల్లకైంకర్యములు గాగ - నెంచవలయు. 2

ఒకని విడిపించుటయును వే - రొకని జేర
బల్కుటయును లేనట్టి యీ - శ్వరునియొక్క

పాడుమెన్నా వవర్ పాడల్,
ఆడుమెనఙ్గ మణఙ్గే, 3

అణఙ్గెన వాడుమెనఙ్గమ్,
వణఙ్గి వఴిపడు మీశర్,
పిణఙ్గి యమరర్ పిదఱ్ఱుమ్,
కుణఙ్కొఴు కొళ్గై యినానే. ౪

కొళ్గై కొళామైయిలాదార్,
ఎళ్గ లిరాగమిలాదార్,
విళ్గై విళ్ళామై విరుమ్బి,
ఉళ్కలన్దా ర్కోరముదే. ౫

సన్నిధిని నాసనము పాయ - దెన్నటికిని

* * *

జిహ్వ వానినే స్మరణంబు - చేయు చుండు

* * *

కాయ మావేశమును బొంది - కదలుచుండు. 3

నేను నే నని సర్వదా - నిత్యసూరు
లంద రనుభవించుటకుగా - ముందు పడెడు
సకల కల్యాణ సుగుణపుం - జంబువాడు ;
అమరవరులకు నిత్యమా - నాశ్రితనిధి ;
అఖిలలోకంబులకును ని - యామకుండు ;

* * *

అట్టివానితో నానంద - మనుభవించి
ఆడుచుండెడి నావేశంబు - నందినట్లు
కాయ మియ్యది ; వానిసం - గంబె దీని
కనవరతమును నానంద - యాత్ర యయ్యె. 4

యోగ్యతనుబట్టి కైంకర్య - మొప్పుకొనుట
యోగ్యతాహీనులను దూర - ముండు మనుట
ఇట్టిభేదగుణంబు లే - నట్టివాడు

* * *

కొందర నుపేక్షచేయుట - కొందరయెడ
నాదరము చూపుటయును లే నట్టివాడు

* * *

వచ్చువాడు ప్రయోజన - పరత వచ్చె
నో యటులగా కనన్యప్ర - యోజనుడుగ
జేర జనియెనో యని విమ - ర్శించి తనను

అముద మమరర్గట్కీన్ద,
నిమిర్ శుడరాఴి నెడుమాల్;
అముదిలు మాఱ్ఱ వినియన్,
నిమిర్తిరై నీళ్ కడలానే. ౬.

నీళ్ కడల్ శూఴిలఙ్గైక్కోన్,
తోళ్గళ్ తలై తుణిశెయ్దాన్
తాళ్గళ్, తలై వణఙ్గి,
నాళ్ కడలై క్కఴిమినే. ౭

కఴిమిన్ తొణ్డీర్గళ్ కఴిత్తు
త్తొఴుమి, నవనై త్తొఴుదాల్,

పరమ గమ్యంబుగా గోరి - యరుగుదెంచు
వాని కతుల మానమృతంబు - వంటివాడు. 5

దేవతలకెల్ల సుధ తన్వి - దీర నిచ్చి
నిమిషనిమిషంబునకు వృద్ధి - నెరపుచున్న
కాంతి భాసించుచుండు చ - క్రంబు దాల్చి
మింటి కెగసెడునలలస - మ్మేళనంబు
నతివిశాలంబు నైనక్షీ - రాబ్ధియందు
బవ్వళించినయాపరా - త్పరునికంటె
నమృత మెక్కువె ? తక్కువ - యగునుగాని

* * *

అట్టియమృతాధికుని మాని, - యమృతపాన
మభిలషించిన యింద్రాది - యమరవరుల
భాగ్యహీనత నే మని - పల్కవచ్చు. 6

ఆసురం బగు ఘనతపం - బాచరించి
మూడులోకంబులం దన - కీడు లేని
భుజబలము గల్గి పదిశిరం - బులను గల్గి
జలధి త్రవ్వనిపరిధిగా - నిలిచియున్న
లంక పాలించు రాక్షస - రాజుబట్టి
శిరములను ద్రుంచి భుజముల - జెండి వైచి
లోకములభీతి బాపు శూ - రునిపదాంబు
జముల దల లుంచి మ్రొక్క మీ - జన్మములకు
సార్థకత గొల్పుడీ! కాల - జలధి దాటి. 7

భాగవతులార! సంసార - బంధసంగ
ములను విడిపించి పురుషో_త్త - మునిపదాశ్ర

వఴినిన్ఱ వల్వినై మాళ్విత్తు,
అఴివిన్ఱి యాక్క త్తరుమే. ౮

తిరుమ వరుమ్పాయ నాయ,
తిరుమగళార్ తని క్కేళ్వన్,
పెరుమైయుడైయ పిరానార్,
ఇరుమై వినై కడి వారే. ౯

కడివార్ తీయ వినైగళ్,
నొడియారు మళవైక్కణ్,
కొడియా వడు పుళ్ళుయర్త్త
వడివార్ మాదవ నారే. ౧౦

మాదవన్ పాల్ శడకోపన్,
తీదవ మిన్ఱి యురైత్త,
ఏదమి లాయిర త్తిప్ప త్తుం
ఓద వల్లార్ పిఱవారే. ౧౧

యం బొనర్పుడు! ఫలసిద్ధి - కడ్డుపడెదు
సర్వపాపంబులను దాన - సమయజేసి
శాశ్వతానంద మైనమో - క్షం బొసంగు. 8
(కర్మనిర్ముక్తి గాంచు టే - కరణి ననిన)

* * *

అఖిలలోకంబులకు మాత - యభయదాత
ఆ దయాభూతి యైన మా - యమ్మప్రేమ
ధర్మములచేతనేని పొం - దంగ నగునె?

* * *

అట్టి శ్రీ దేవి వాత్సల్య - మతిశయించి
పురుషకారం బొనర్ప న - ప్పూరుషుండు
భక్తులను గాచు పుణ్యపా - పములనుండి. 9
శత్రువులనెల్ల ద్రుటిలోన - సంహరింప
శక్తిమంత మౌ గరుడధ్వ - జము ధరించి
అతిమనోహరరూప దే - హంబు దాల్చి
పరమకరుణాస్వరూపిణీ - వల్లభుండు
క్రూరపాపంబులను దెగ - గోయుకొరకు
కాల మెంతయో! పట్టదు; - క్షణము చాలు. 10
మాధవునిగూర్చి శఠకోప - మౌని యిట్లు
స్వాభిమానంబు మరి యుపే - క్షయును లేని
యనఘు డంచాన తిచ్చు స - హస్రపాశు
రములలో నీపదింటి పా - ఠము ఘటించు
వారు జన్మరాహిత్యంబు - పడయగలరు. 11

## ముదల్ పత్తు

## ఏఴామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

పిఱవిత్తుయరఱ
ఞానత్తుళ్ నిన్ఱు,
తుఱవిచ్చుడర్విళక్కమ్
తలైప్పెయ్వార్,
అఱవనై యాఴిప్పడై
యన్దణనై,
మఱవైయిన్ఱి
మనత్తువైప్పారే. ౧

వైప్పామరున్దా మడియరై,
వల్వినైత్
తుప్పామ్పుల నైన్దుమ్
తుఞ్జక్కొడానవన్,
ఎప్పాలెవర్క్కుమ్
నలత్తాలుయర్న్దుయర్న్దు,
అప్పాలవనెఙ్గ
ళాయర్కొఴున్దే. ౨

## ప్రథమ శతకము

## సప్తమ దశకము



### (ధ్యానము)

జన్మసంబంధ మగు దుఃఖ - సమితి పోవ
జ్ఞానసహితంబుగా నుపా - సన మొనర్చి
ప్రకృతిసంబంధముల నెల్ల - బాపివైచి
ధార్మికుడును సుదర్శన - ధారియు నగు
పరమపావను డౌ పరా - త్పరుని మాన
సమున ధ్యానింపుడీ సర్వ - సమయములను. 1

ఆశ్రితుల యొక్క పంచేంద్రి - యముల బట్టి
క్రూరకర్మంబులకు వృద్ధి - గూర్చు దుష్ట
మార్గముల బోవనీయక - మరల జేయు

* * *

అఖిలదుఃఖంబులకు వాడె - యౌషధంబు
శిష్టమార్గంబు జూపు ని - క్షేప మతడె!

* * *

ధరణి గల్గిన సర్వచే - తనుల కంటె
నతిశయానంద మాతని - యనుభవంబు

* * *

వర్ణనాతీతు డగు గోప - బాలు డతడు
సర్వదా నామనోవీథి - సంచరించు. 2

ఆయర్ కొఴున్దా
యవరా ఱ్పుడై యుణ్ణుమ్,
మాయప్పిరానై
యెన్మాణిక్కచ్చోదియై,
తూయవముదై
ప్పరుగిప్పరుగి, యెన్
మాయప్పిఱవి
మయర్వఱుత్తేనే. ౩

మయర్వఱ వెన్మనత్తే
మన్నినాన్ఱన్నై,
ఉయర్వినైయే తరు
మొణ్ శుడర్క్కఱ్ఱైయై,
అయర్విలమరర్గ
ళాదిక్కొఴున్దై, యె
న్నిశైవినై యెన్శొల్లి
యాన్ విడువేనో. ౪

విడువేనో వెన్విళక్కై
యెన్నావియై,
నడువే వ

భక్తవత్సలు డగుచు గో - పకులయందు
జనన మై నవనీతంబు - సంగ్రహించి
గొల్లయిల్లాం డ్రొసగు శిక్ష - లెల్ల బడెడు
పరమసులభుండు నాశ్చర్య - కరగుణుండు ;

* * *

ఇంద్రనీలమణిం బోలు - సాంద్రకాంతి
యుతుడు నిర్దోషు డమృతతు - ల్యుం డతండు
అట్టివాని నిరంతర - మనుభవించి
ప్రాకృతం బగుజన్మసం - బంధమునను
బరగు నజ్ఞానదోషముం - బాపుకొంటి. 3

దోషములు సమూలంబుగా - దుడిచివేయ
నామనస్సున నిలుచునా - నందమయుని

* * *

జ్ఞానభక్త్యాదులను నా కొ - సంగువాని
నఖిలచిదచిద్విలక్షణం - బై ప్రకాశ
వంత మగుచు భాసించు రూ - పంబువాని

* * *

లోపములు లేని నిత్యసూ - రులను గూడి
యున్నరీతిగా నను గూడి - యున్నవాని
సర్వలోకేశ్వరుం డైన - సత్పురుషుని

* * *

ఏమిలోపంబు లున్నవం - చేను విడుతు ? 4
నాస్వరూపరూపాదు లా - నందమయము
లంట గనజేయు దీపంబు - వంటివాడు

* * *

న్దయ్యక్కొళ్ గిన్ఱ నాదనై,
తొణ్డువేశెయ్
దిళవాయ్చ్చియర్ కణ్ణినుళ్,
విడవేశెయ్దు
విఴిక్కుమ్బిరానైయే. ౫

పిరాన్ పెరునిలఙ్కీణ్డవన్,
పిన్నుమ్
విరాయ్ మలర్త్తుఴాయ్
వేయ్న్ద ముడియన్.
మరామరమెయ్ద
మాయవన్, ఎన్నుళ్
ఇరానెనిల్ పిన్నై
యానొట్టువేనో. ౬

ఎవడనోయైన నామాన - సేంద్రియమున
జేరి నాయాత్మవృద్ధి - రచించుస్వామి ;

* * *

కపటనాటకముల గోప - కామినులకు
గానవచ్చియు క్షణములో - గానబడక
మాయ లొనరించు మాయల - మారి వేష
ధారి జగముల కుపకారి - దానవారి;

* * *

అట్టినాప్రాణనాథు బా - యంగ దరమె? 5

భువనములయెడ నుపకార - బుద్ధి దాల్చి
పృథివి ప్రళయార్ణవమునుండి - వే రొనర్చి
వెలికి దీసినయమ్మహా - ప్రియతముండు

* * *

పరిమళంబుల వెదజల్ల - బక్వములుగ
విరియు తులసీదళములచే - మెరయుచున్న
డంబు మీరిన మణికిరీ - టంబువాడు

* * *

సాలవృక్షసప్తకము నా - శ్చర్యగతి
క్షణములోపల బెకలించు - శక్తియుతుడు

* * *

అద్భుతం బగు దివ్యగు - ణానుభవము
నాకు రుచి చూపి నను శర - ణనగ జేసి,
విడువ దలచిన, వాని నే - విడుతునొక్కొ! 6

యానొట్టియెన్ను
ళిరుత్తువమెన్ఱిలన్,
తానొట్టి వన్దెన్ఱని
నెఞ్జైవఞ్జిత్తు,
ఊనొట్టి నిన్ఱె
న్నుయిరిఱ్కలన్దు, ఇయల్
వానొట్టుమో
ఇనియెన్నై నెగిఴక్కవే. ౭

ఎన్నై నెగిఴక్కిలు
మెన్నుడై నన్నెఞ్జమ్
తన్నై, యగల్విక్క
త్తానుఙ్కిల్లానిని,
పిన్నై నెడుమ్పణైత్తోళ్
మగిఴ్పీడుడై,
మున్నై యమరర్
ముఴుముదలానే, ౮

అమరర్ ముఴుముద
లాగియ వాదియై,
అమరర్క్కముదీన్ద
వాయర్ కొఴున్దై,
అమరవఴుమ్బ
త్తుఴావి, యెన్నావి
అమర త్తఴువిఱ్ఱిని
యగలుమో. ౯

నే నపేక్షించి నాదుహృ - న్నిలయమందు
స్థిరముగా నుండు మనుచు - ప్రార్థింపలేదు;

* * *

వాడె నామీఁదియాశతో - వచ్చి నాస్వ
తంత్ర మగు నామనము నెవ్వి - ధమున నేని
వశము నొనరించుకొని, హేయ - వస్తువైన
యీశరీరంబు విడిపింప - కిట వసించి,
ఆత్మ కధికారి యైన స - ర్వాత్మకుండు
వంచనను నన్ను విడ సమ్మ - తించునొక్కొ! 7

సుదతి నప్పిన్నబాహు సం - పదను గాంచి
యామెసంశ్లేషసౌఖ్యంబు - ననుభవించి,
పూర్వు లగు నిత్యసూరుల - పూరుషార్థ
ములకు గారణ మైన శ్రీ - భూధవుండు
నన్ను విడిపించినను, నామ - నస్సు నెట్టు
లతడు విడిపించు బరిశుద్ధ - మైన దగుట. 8

నిత్యులకు గారణం బైన - నేత యగుచు
సర్వజగముల సృష్టించు - జాణ యగుచు
సురలకెల్లను సుధ పంచు - సులభు డగుచు
గోపకులమందు బుట్టు న - క్రూరవరదు
రసికజనశేఖరుని గుణా - ర్ణవము ననుభ
వించు నాయాత్మ వాని న - వ్వీధిని బాయు. 9

అగలి లగలు
మణుగి లణుగుమ్.
పుగలుమరియన్
పొరువల్ల నెమ్మాన్,
నిగరిలవ న్పుగழ்పాడి
యిళైప్పిలమ్,
పగలుమిరవు
మ్పడిన్దుకుడైన్దే. ౧౦

కుడైన్దువణ్డుణ్ణుమ్
తుழாయ్ ముడియానై,
అడైన్ద తెన్కురుగూ
ర్చ్చటకోపన్,
మిడైన్దశొఱ్ఱొడై
యాయిర త్తిప్పత్తు,
ఉడైన్దు నోయ్ గళై
యోడువిక్కుమే. ౧౧

ధనము మొదలగు కాంతుల - దాల్చి వచ్చి
కోర్కులం దీర్చుకొని పోవ - గోరువారి
బోవ నిచ్చుచు, దనయందె - పూర్ణ కాంతు
గలుగువారలతో నుండు - గలసిమెలసి;

* * *

భక్తజనులకు సులభుం డ - భక్తజనుల
కనవరతమును దుర్లభుం - డగుచు వెలయు;

* * *

అట్టి నాస్వామి సహజక - ల్యాణగుణ వి
మర్శనంబును గానంబు - దర్శనంబు
పగళులును రాత్రులును నెడ - బాయ కుందు. 10

మధువు నాస్వాదన మొనర్చు - మధుకరముల
గలిగి చెలువొందు తులసిమా - లల శిరమున
దాల్చు సర్వేశ్వరునియందె - ధ్యాన ముంచి,
మహితగుణు డైన శఠగోప - మౌనివరుడు
వ్రాయు వేయింట నివి పది - పాశురములు

* * *

వీని నెవడేని పఠియించు - నేని వాని
వ్యాధు లెల్లను దునుకలై - పారిపోవు. 11

## ముదల్ పత్తు

## ఎట్టామ్ తిరువాయ్మొఴి



(మూలమ్)

ఓడు మ్పుళ్ళేఱి,
శూడు న్దణ్డుఴాయ్,
నీడునిన్ఱు, అవై
ఆడుమమ్మానే. ౧

అమ్మానాయ్, పిన్నుమ్
ఎమ్మాణ్బుమానాయ్
వెమ్మా వాయ్కీణ్డ,
శెమ్మా కణ్ణనే. ౨

## ప్రథమ శతకము

## అష్టమ దశకము



(వాత్సల్యము)

తనకు గైంకర్య మొనరింప – దలచి యెపుడు
కాచుకొని యున్న గరుడుని – బ్రోచుకొరకు
వహనకృత్యంబు వానిచే – బడయు చుండు;

*   *   *

బహుళవిశ్లేషబాధచే – భంగపాటు
పరుపరా దని తులసిని – మరచి పోవ
కెప్పుడును మాలగా దాల్చి – యొప్పుచుండు;

*   *   *

ఆశ్రితుల కిట్లు సంశ్లేష – మనవరతము
గలుగ జేసి నాస్వామి ర – క్షణ మొనర్చు.     1

క్రూరరాక్షసు డగు కేశి – గుఱ్ఱ మగుచు
పైకి రా వానివదనంబు – బట్టి చీల్చె
శిష్టులను బట్టి బాధించు – దుష్టజనుల
శిక్ష యొనరించుచో గన్ను – లెఱ్ఱబడెడి;
ఎంత యాగ్రహమో! యప్పు – డెరుగ రాదు

*   *   *

ఇట్లు వివిధావతారంబు – లెత్తి లోక
రక్షణము చేయు నా సర్వ – రక్షకుండు.     2

కణ్ణావానెన్ఱుమ్,
మణ్ణోర్ విణ్ణోర్క్కు,
తణ్ణార్ వేఙ్గడ,
విణ్ణోర్ వెఱ్పనే. ౩

వెఱ్పై యొన్ఱెడుత్తు,
ఒఱ్కమిన్ఱియే,
నిఱ్కుమమ్మాన్శీర్,
కఱ్పన్ వైగలే. ౪

వైగలుమ్వెణ్ణెయ్,
కైకలన్దుణ్డాన్,
పొయ్కలవాదు, ఎన్
మెయ్కలన్దానే. ౫

కలన్దెన్నావి,
నలఙ్కొళ్ నాదన్,
పులన్కొళ్ మాణాయ్,
నిలఙ్కొణ్డానే. ౬

పరమపదవాసు లైనస - ర్వజ్ఞులకును
ధరణి నున్నయల్పజ్ఞ లౌ - పురుషులకును
జ్ఞాన నేత్రంబు గాడె నా - స్వామి యెపుడు

*　　　*　　　*

నిత్యసూరులు సేవించు - నిలయ మనగ
జాలనొప్పెడు వేంకటా - చలమునందు
ప్రభువుగా నిల్చి చేయు భూ - పాలనంబు
నిఖిలజనులకు సంసేవ - నీయు డగుచు. ౩

తనను నమ్మిన గోపబృం - దంబుమీద
విబుధపతి రాళ్ళవాన కు - ర్పించినపుడు,
ఏడురాత్రంబు లొకకొండ - నెత్తిపట్టి
ఛత్రముగ జేసి వారిర - క్షణ మొనర్చె;

*　　　*　　　*

ఆదయామయు సహజక - ల్యాణగుణము
లనవరతమును గొనియాడ - నభ్యసింతు. ౪

గోపికలు భద్రముగ దాచు - కొనెడు వెన్న
హస్తముల బట్టి కలఘుచు - నారగించు
ముద్దుబిడ్డడు నాజగ - న్మోహనుండు
ఖండితంబుగ నాలోన - గలసిపోయె. ౫

అట్లు నాలోన గలసి నా - యాత్మ దనకు
శేషముగ సమ్మతించు హృ - షీకనాథు
డేగదా! నాడు లోకంబు - లెల్ల నొక్క
పాదమున గొల్చు వామన - బ్రహ్మచారి. 6

కొణ్డానేఴ్విడై,
ఉణ్డానేఴ్వైయమ్,
తణ్డామఞ్జెయ్దు, ఎన్
ఎణ్డానానానే. ౭

ఆనానానాయన్,
మీనోడేనముమ్,
తానానా నెన్నిల్,
తానాయ శఙ్గే. ౮

శఙ్గుశక్కరమ్,
అఙ్గైయిల్కొణ్డాన్,
ఎఙ్గుమ్తానాయ,
నఙ్గళ్ నాదనే. ౯

నాదన్ ఞాలఙ్గొళ్
పాదన్, ఎన్నమ్మాన్,
ఓదమ్పోల్ కిళర్,
వేదనీరనే. ౧౧

ప్రళయకాలాన లోకస - ప్తకము నొక్క
ముద్దగా మ్రింగు లయమూర్తి - మురహరుండు

*　　*　　*

వెలది నప్పిన్న దేవిని - బెండ్లియాడ
సప్త వృషభంబులను జంపు - సాహసుండు

*　　*　　*

ఇట్టి వింతల నెన్నిటి - నేని చూచి
తనకు దాస్యం బొనర్ప బ్రా - ర్థన మొనర్చు
నన్ను బ్రేమించి నాప్రార్థ - నమును దీర్చి
పరమపదసుస్థిర ప్రేమ - పాదుకొలిపె. 7

తనకు నాయందు గల ప్రేమ - మునకు ఫలము
గాగ, భోగ్యంబు లగుతన - కార్యములను
నే ననుభవింప, గొల్లడై - దానె పుట్టె;
మరి వరాహమత్స్యముల జ - న్మంబు లెత్తె. 8

నను వశం బొనరింప మ - నమున నెంచి
యన్నియవతారముల మనో - హరము లైన
హస్తములయందు శంఖచ - క్రాదిదివ్య
సాధనంబుల ధరియించి - సంచరించె 9

సర్వమునకు నియంత నా - స్వామి భూమి
నెల్ల గొలిచిన పాదంబు - లెసగువాడు

*　　*　　*

వాని కల్యాణగుణముల - వర్ణనంబు
నా కసాధ్యంబు గాదె; ర - త్నాకరంబు
బోలె బొంగెడు శ్రుతివాక్య - ములకె దగును. 10

నీర్ పురై వణ్ణన్,
శీర్ శడకోపన్,
నేర్ ద లాయిరత్తు,
ఓర్ ద లివైయే. ౧౧

ముదల్ పత్తు

ఒన్బదామ్ తిరువాయ్ మొழி

( మూలమ్ )

ఇవైయు మవైయు మువైయు
మివరు మవరు మువరుమ్,
యవైయుమ్ యవరుమ్ తన్నుళ్ళే
యాగియుమాక్కియుమ్ కాక్కుమ్,
అవైయుళ్ తనిముదలెమ్మాన్
కణ్ణపిరా నెన్నముదమ్,
శువైయన్ తిరువిన్ మణాళ
నెన్నుడై చ్చూழலుళానే. ౧

భోగ్యతాశీతలత్వము - లొప్పెల్చు చున్న
స్వామి కల్యాణ సుగుణవి - షయము గాగ
భక్తజనుల కుజ్జీవన - ప్రాప్తికొరకు
చిరునగరిమాని శఠకోప - విరచితమగు
పాశుర సహస్రమం దిది - పది యొకండు. 11

---

ప్రథమ శతకము

నవమ దశకము

(వాత్సల్యము)

చేతనాచేతనాత్మక - సిద్ధమైన
సర్వలోకంబులను లయ - సమయమందు
సంహరించుచు దనలోన - సంతరించి
మరి పునస్సృష్టి జేసి యే - మరక వాని
కాత్మగా దాని నిల్చి ర - క్షణ మొనర్చి
పరమకారణ భూతుడై - పరగువాడు;

*　　*　　*

అమితసులభుండు నాకు భో - గ్యమగువాడు
పరమరసికుండు నగు శ్రియః - పతి చెలంగు
నాకు రెండుపార్శ్వములందు - నన్ను వశ్య
గా నొనర్చుటకొరకు స - త్కరుణ బూని. 1

సూఴల్ పలపలవల్లా఩్,
తొల్లైయఙ్కాలత్తులగై
కేఴలొన్ఱాగి యిడన్ద
కేశవ నెన్నుడై యమ్మా఩్,
వేఴమరుప్పై యొశిత్తా఩్
విణ్ణవర్ క్కెణ్ణలరియా఩్,
ఆఴనెడుఙ్కడ ల్శేర్న్దా
నవనె న్నఱుగలిలానే, ౭

అఱుగలిలాయ పెరుఞ్జీ
రమరర్గ ళాదిముదల్వా఩్,
కఱుగియ నీలనన్మేనివణ్ణ఩్
శెన్దామరై క్కణ్ణ఩్,
పొఱుశిఱై ప్పుళ్ళువన్దేఱుమ్
పూమగళార్ తనిక్కేళ్వ఩్,

భక్తజనులకు దర్శన - ప్రాప్తి లాభ
మిచ్చుటకు నవతారంబు - లెత్తువాడు ;

* * *

ఆదికాలంబున న్వరా - హస్వరూప
మును ధరించుచు నబ్ధిలో - మునిగి యున్న
లోకముల గాచుకొను సత్పు - రుషవరుండు

* * *

కువలయాపీడ మనుదంతి - కొమ్ము లొక్క
చేతనే పట్టి తునుకల - జేయువాడు ;

* * *

జగతిలో గీర్తి గన్న కే - శములవాడు

* * *

దేవతోత్తములకు గూడ - దెలియరాని
యద్భుతానంతదివ్యక - ల్యాణగుణుడు

* * *

అతివిశాలంబపారంబు - నైన క్షీర
నిధి దనకు బాన్పుగా శయ - నించువాడు
అట్టి శ్రీనాథు డుండు నా - యందె యెపుడు. 2

నిత్యములు నాశనంబు లే - నివియు నైన
సకల కల్యాణ గుణముల - సత్ప్రకాశు
డగుచు, మరణంబు లేని ని - త్యాత్మలకును
గారణుం డౌచు, నీలమే - ఘముల కాంతి
మెరయు దివ్యదేహచ్ఛాయ - నెరపువాడు;

* * *

ఒరుకదియిన్ శువైతన్ది
ట్టొఴివిల నెన్నోడుడనే. ౩

ఉడనమర్ కాదల్ మగళిర్
తిరుమగళ్ మణ్మగ ళాయర్
మడమగళ్, ఎన్ఱివర్ మూవరాళు
ములగముమ్ మూన్ఱే.
ఉడనవై యొంక విఴుఙ్గి
యాలిలై చ్చేర్న్దవ నెమ్మాన్
కడన్మలి మాయప్పెరుమాన్
కణ్ణ నెన్నొక్కలై యానే. ౪

ఒక్కలై వైత్తు ములైప్పా
లుణ్ణెన్ఱు తన్దిడవాఙ్గి,
శెక్కమ్ శెగవన్ఱవళ్ పా
లుయిర్ శెగవుణ్డ పెరుమాన్,

పుండరీకాక్షు డగుచు రా - పులుగు నెక్కి
ప్రీతి సంచార మొనరింప - వెడలువాడు;
ఇందిరాసుందరికి హృద - యేశ్వరుండు;

*    *    *

నన్ను వరియించి నిత్యాలం - దున్నప్రేమ
తోడ నను దన భోగ్యవ - స్తువు నొనర్చి
నాకు భోగ్యుఁడై యుండు న - నారతంబు  3
పట్టపుందేవియైన శ్రీ - పంకజాక్షి
వసుమతీదేవియును ని -ళా వనరుహాక్షి
హృదయనాయికలుగ నిల్చి - యెల్లయపుడు
సర్వ మంగళముల వెద - జల్లుచుండ;

*    *

మహిం మొదలుగాఁగ నున్న స - మస్తలోక
వితతి లీలా విభూతియై - వెలయుచుండ
సృష్టియును స్థితి సంహార - చేష్టితములు
కేవలము లీలలై తన - కీర్తి నిలుప
పాలసంద్రంబులో వట - పత్త్రతల్ప
శయనుఁడై యుండె నని సుర - ల్సంస్తుతింప
అట్టినా స్వామియైన య - య్యాదుకులాధి
నాథు డద్భుతాశ్చర్యగు - ణాన్వితుండు
న ప్రవేశించె నామనో - నాథు డగుచు  4
రుద్రుతోఁగూడ బ్రహ్మ నిం - ద్రుని దదాది
సర్వజంతుజాలము నొక్క - సమయమున నె
సృష్టిచేసి పాలించు స - ర్వేశ్వరుండు

*    *    *

నక్కపిరానో డయను
మిన్దిరను మ్ముదలాగ,
ఒక్కవు న్తోఱ్ఱియవీశన
మాయనె న్నెఞ్జినుళానే. ౫

మాయనె న్నెఞ్జినుళ్ళాన
మఱ్ఱుమ్యవర్కు మదువే,
కాయముమ్ శీవనున్తానే
కాలుమెరియు మవనే,
శేయనణియన యవర్కుమ్
శిన్దైక్కు గోచరమల్లన,
తూయ న్నుయక్కన్నయక్క
నెన్నుడై త్తోళినై యానే. ౬

తోళినై మేలుమ్ నన్మార్పిన మేలుమ్
శుడర్ముడి మేలుమ్,
తాళినై మేలు మ్పునైన్ద
తణ్ణన్తుழாయుడై యమ్మాన
కేళినై యొన్నుమిలాదాన
కిళరుమ్ శుడరొళిమూర్త్తి,

నడుమునం జేర్చుకొనుచు స్త - న్యం బొసంగి
త్రాగు మని కోరుకొనెడు పూ - తన స్తనముల
పాలు ద్రాగుటయే గాక - ప్రాణములను
బీల్చివేసిన శ్రీసతి - ప్రేమ మూర్తి
హృదయవర్తియై యుండె నా - కెల్లయపుడు.　　5

అఖిల దేవాది భూతకా - యంబులకును
వాసి యాత్మలకును నంత - రాత్మ యగుచు
అట్లె యగ్నివాయువుల గా - యముగ గల్గి
భక్తజనసమీపస్థుఁడై - భక్తిచేత
దక్క నెట్టి జ్ఞానులకేని - దరియరాని
పూర్ణపరిశుద్ధుడై సదా - పొల్చువాడు

*　　*　　*

ఆశ్రితులు కానివారల - కధికసంశ
యాస్పదుండును విపరీత - మైనజ్ఞాన
మిచ్చువాడైన నాహృద - యేశ్వరుండు
అద్భుతాశ్చర్య సర్వక - ల్యాణగుణుడు

*　　*　　*

పులుగు రాజునుబోలె నా - భుజము లెక్కి
యున్నవా డితరుల కట్టు - లుండునొక్కొ!　　6

రెండు భుజములయందు గి - రీటమందు
బాదపంకజములయందు - వక్షమందు
సరస సౌందర్య మాధుర్య - సౌరభముల
నించు తులసి మాలికల ధ - రించువాడు

*　　*　　*

నిరుపమాన గుణాఢ్యుండు - నిమిష నిమిష

నాళన్ఱు తొట్టుమగలా
నెన్నుడై నావినుళానే, ౭

నావినుళ్ నిన్ఱుమలరుమ్
ఞానక్కలైగళు క్కెల్లామ్,
ఆవియు మాక్కైయుమ్ తానే
అఴిప్పోడళిప్పవన్తానే,
పూవియల్ నాఱ్ఱడన్తోళ఩్
పొరుపడై యాఴి శఙ్గేన్దుమ్,
కావిన న్మేని క్కమల క్కణ్ణ
న఩్ కణ్ణినుళానే. ౮

కమలక్కణ్ణన఩్ కణ్ణినుళ్ళా఩్
కాణ్బనవ఩్ కణ్గళాలే,
అమలఙ్గళాగవిఴిక్కుమ్
ఐమ్బులను మవ఩్మూర్త్తి,
కమలత్తయ న్నమ్బితన్నై
క్కణ్ణుదలా నొడున్తోఱ్ఱి,
అమలత్తెయ్వత్తోడులగమాక్కి
యెన్నొఱ్ఱియుళానే. ౯

మధిక మగు ప్రకాశంబుతో - నలరువాడు

*   *   *

ఎల్లయపుడు నాలో వసి - యించువాడు
సర్వలోకేశ్వరుండు నా - స్వామి యెపుడు
చేరి వాసం బొనర్చు నా - జిహ్వయందు.   7

వేదవేదాంగము లగు స - ద్విద్యలెల్ల
నాల్కనుండి సృష్టించు జ్ఞా - నప్రదాత;
అట్టివిద్యల ప్రాణ మా - నర్థమునకు
తచ్ఛరీరంబు లైన శ - బ్దంబులకును
అఖిలభువన సృష్ట్యాది కా - ర్యంబులకును
గారణంబును నిర్వాహ - కర్త భర్త;

*   *   *

పుష్పగుచ్ఛకాంతుల జతు - ర్భుజము లొప్ప
శత్రు సంహారకము లగు - శంఖచక్ర
ములు గరంబుల భూషణ - ములుగ వెలుగ
గలువకాంతినిబలె దేహ - కాంతి చెలగ
గమలపత్రాక్షు డగుచు నా - కనులయందు
గట్టినట్లుగ సర్వదా - గానబడెడి.   8

కమలనేత్రుండు కన్నుల - గానబడుట
వేడ్క దీరంగ వాని సే - వించు చుంటి;
నా నిరంతర దోష వి - నాశనంబు
గాంతు, వానికటాక్ష వీ - క్షణమువలన,
ఈశరీరమం దుండు పం - చేంద్రియములు
వానివశ్యంబులై చేయు - వర్తనములు;

*   *   *

పద్మమున బుట్టి జ్ఞానసం - పన్ను డైన

నెఱ్ఱియుళ్ నిన్ఱనైన్ఱూళుమ్
నిరైమల ర్పాదఙ్గళ్ శూడి,
కఱ్ఱైత్తుఴాయ్ ముడి క్కోల
క్కణ్ణపిరానై త్తొఴువార్,
ఒఱ్ఱైప్పిఱై యణిన్దానుమ్
నాన్ముగను మిన్దిరనుమ్,
మఱ్ఱైయమరరు మెల్లామ్ వ
న్దెన దుచ్చియుళానే. ౧౦

ఉచ్చియుళ్ళేనిఱ్కు
త్తేవ తేవఱ్కు క్కణ్ణపిరాఱ్కు,
ఇచ్చైయుళ్ శ్చెల్లవుణర్త్తి
వణ్కుఱుగూర్ చ్చడకోపన్,
ఇచ్చొన్నవాయిరత్తు
ళివైయుమోర్ పత్తెమ్పిరాఱ్కు,
నిచ్చలుమ్ విణ్ణప్పమ్ శెయ్య
నీళ్ కఴల్ శెన్నిపొరుమే. ౧౧

బ్రహ్మతో గూడ మూడు నే - త్రముల వాని
నింద్రునిని భువనముల సృ - జించినట్టి
పరమ సాత్త్వికమూర్తి నా - పై ననుగ్ర
హించి నాముఖమందు వ - సించు చుండు;
అతని సర్వేంద్రియములచే - ననుభవింతు. 9

అంచితముగ నావద - నారవింద
వాసియై నన్ను బాలించు - స్వామిపాద
పంకజములకు శిరములు - వంచి మ్రొక్కి,
బ్రహ్మరుద్రాది దేవతా - పతులు గొల్త్రు;

* * *

అట్టిసర్వలోకేశ్వరుం - డైనవాడు
తులసి మాలల ధరియించు - తోయజాక్షు
డెపుడు నాశిరంబున వసి - యించు చుండు. 10

ఈవిధిం దనశిరమునం - దిడినపాద
పద్మములవాని, దేవదే వస్వాహాప్రు
విషయమై శఠకోపుండు - విన్నవించు
పాశురంబులం దీపది - పఠనచేయు
నట్టిభక్తశిరోభాగ - మందు స్వామి
పాదపంకజముల నిల్పు - బరమప్రీతి. 11

## ముదల్ పత్తు

# పత్తామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

పొరుమానీళ్ పడై
యాఴిశఙ్గత్తొడు,
తిరుమానీళ్ కఴ
లేఴులగున్తొఴ,
ఒరుమాణి క్కుఱళాగి
నిమిర్న్ద అక్
కరుమాణిక్క మె
న్కణ్ణుళదాగుమే. ౧

కణ్ణుళ్ళేనిఱ్కు
ఙ్కాదనైత్తయాల్ తొఴిల్,
ఎణ్ణిలుమ్వరు
మెన్నినివేణ్డువమ్,
మణ్ణుమ్ నీరు
మెరియునల్వాయువుమ్,
విణ్ణుమాయ్ విరియు
మెమ్బిరానైయే. ౨

## ప్రథమ శతకము

## దశమ దశకము

(ధ్యానము)

బలిని బంధింప మనసులో - పల దలంచి,
సంగరోన్ముఖ భాసురో - జ్జ్వలము లైన
శంఖచక్రాది సాధన - సహితు డగుచు
లలిత సంపూజ్య సౌందర్య - రాసు లనగ
వెలయు నిడుద లౌ పాదార - విందములను
అఖిలలోకంబులజనంబు - లాశ్రయింప,
బరమ సుకుమారి వామన - బ్రహ్మచారి
లోకముల గొల్వ బెరిగిన - రూపధారి
నీలమాణిక్య కాంతుల - డాలుతోడ
దర్శనానంద మొసగె నా - తనివి దీర. 1

ధరణి మొద లగు పంచభూ - తములయందు
వ్యాప్తిచెందిన సర్వాంత రాత్మ - యతడు
భక్తితో నాశ్రయించిన - ప్రజలకెల్ల
నక్షిగోచరు డగుచు బ్ర - త్యక్ష మగును

*     *     *

ఈశ్వరుం డున్నవిషయంబు - నెరుగువారు
వాని స్మరియించినంతనే - వచ్చు; గనుక
వేరువస్తువునెడల న - పేక్ష యేల? 2

ఎమ్బిరానై యెన్దైతన్దై తన్దైక్కుమ్
తమ్బిరానై, తణ్డామరై క్కణ్ణనై,
కొమ్బరావు నుణ్ణేరిడై మార్వనై,
ఎమ్బిరానై త్తొఴాయ్ మడనెఞ్జమే. ౩

నెఞ్జమే నల్లైనల్లై యున్నై ప్పెఱ్ఱాల్
ఎన్ శెయ్యోమ్, ఇనియెన్న కుఱైవినమ్.
మైన్దనై మలరాళ్ మణవాళనై.
తుఞ్జుమ్బోదుమ్ విడాదు తొడర్ కణ్డాయ్. ౪

కణ్డాయే నెఞ్జే
కరుమఙ్గళ్ వాయ్క్కిన్ఱు, ఓర్
ఎణ్ణానుమిన్ఱియే
వన్దియలుమాఱు,
ఉణ్ణానై యులగేఴు
మోర్ మూవడి
కొణ్డానై,
కణ్డుకొణ్డనై నీయుమే. ౫

నీయుమ్నాను మిన్నేర్ నిఱ్కిల్ మేల్ మఱ్ఱోర్,
నోయుమ్శార్కొడాన్ నెఞ్జమేశొన్నేన్,
తాయు న్దన్దైయుమా యివ్వులగినిల్,
వాయుమీశన్ మణివణ్ణనెన్దైయే. ౬

ప్రీతి నాకును నా తండ్రి - తాతలకును
స్వామివై, క్షీరవారాబ్ధి - పట్టి నురము
నందు ధరియించువై కుంతు - నబ్జనేత్రు
మహితగుణు నాశ్రయింపుమా! - మానసంబ!
నీవు నాకు విధేయవై - నిలుతు వేని ; 3

మంచిపని చేసితివి నీవు - మానసంబ!
దుర్ఘటం బేది నీవు నా - తోడ నుండ,
నే కొఱంతయు నా కుండ - దింక నైన
నెప్పుడేనియు శ్రీపతి - యెడల నాకు
మరపు గల్గిన నీవు యే - మరగ రాదు. 4

కార్యములు సఫలంబు లౌ - కాలమందు
మన ప్రయత్నంబు లేక సం - ప్రాప్త మగుట
గన్నులారంగ జూచితి - గాదె మనమ!

*　　*　　*

లోకములనెల్ల దిని గుజ్జు - రూప మంది
మూడుపాదంబులం గొల్చి - భువనకోటి
మరల గొని రక్షణ మొనర్చు - మహితగుణుని
గాంచితిమి గాదె! కన్నుల - కఱవు దీర. 5

నీవు నేనును నాదయా - నిధిని విడువ
కెప్పుడును ప్రేమతో నాశ్ర - యింతు మేని,
భువనకోటినెల్లను దండ్రి - వోలె గాచి
తల్లివోలె బోషించు నా - ధన్యమూర్తి
సర్వలోకము బ్రోలించు - చక్రవర్తి
నీలమణికాంతి విలసిల్లు - నిర్మలుండు

ఎన్దాయెన్ఱు మెమ్బెరుమానెన్ఱుమ్,
శిన్దైయుళ్ వైప్పన్ శొల్లువన్ పావియేన్,
ఎన్దైయెమ్బెరుమానెన్ఱు, వానవర్
శిన్దైయుళ్ వైత్తు చ్చొల్లుమ్ శెల్వనైయే. ౬

శెల్వనారణనెన్ఱ
శొల్కేట్టలుమ్,
మల్గుఙ్కణ్పని
నాడువన్ మాయమే,
అల్లునన్ పగలు
మిడై వీడిన్ఱి,
నల్గియెన్నై విడాన్
నమ్బినమ్బియే. ౭

నమ్బియై త్తెన్కుఱుఙ్గుడినిన్ఱ, అచ్
చెమ్బొనేతిగళ త్తిరుమూర్త్తియై,
ఉమ్బర్ వానవ రాదియఞ్జోదియై,
ఎమ్బిరానై యెన్ శొల్లి మఱప్పనో. ౮

ఆశ్రితావనపరతంత్రు - డగుట, మనల
కష్టములు గల్గ నీయక - కాచుకొనును

* * *

నమ్ము మిది సత్యవచనంబు - నామనస్స! 6

అన్నివిధముల దనస్వామి - యనుచు నిత్య
సూరిలోకంబు సర్వదా - స్తుతి యొనర్చు
నఖిలలోకేశ్వరుని బాపి - నైన నాకు
స్వామి యంటిని ప్రియ మైన - బంధు వంటి
శేషి యంటి నీరీతి నా - చిత్తమందు
దలచుటే గాక బయటికిం - బలుకుచుంటి. 7

ప్రీతి నారాయణుని పేరు - వినినయంత
కన్ను లానందబాష్పము - ల్గార్చుచుండు ;
నేను వెదకుచు జేరుదు - వానిదాపు ;

* * *

నన్ను దాసునిగా నమ్మి - నళిననేత్రు
డతులితం బగు ప్రేమ నా - యందు జేరి
రేయిబవళులు న న్నేడ - బాయకుండు
నెంతప్రేమయొ యాశ్చర్య - మెరుగరాదు. 8

తిరుకురుంగుడి వసియించు - దేవదేవు
నతులితైశ్వర్య సంపూర్ణు - నసమతేజు
మంచిబంగారువన్నెను - మించునట్టి
దివ్య సుందరవిగ్రహు - దీర్ఘపాదు
విడువ నెట్లోర్తు విడిచి యే విధి భరింతు. 9

మఱప్పుమ్ఞానముమ్ నానొన్ఱుణర్న్దిలన్,
మఱక్కుమెన్ఱు శెన్దామరైక్కణ్ణోడు,
మఱప్పఱవెన్నుళ్ళే మన్నినాన్ఱన్నై,
మఱప్పనోవిని యానెన్మణియైయే. ౧౦

మణియై వానవర్కణ్ణనై
త్తన్నదో
రణియై, త్తెన్కురుగూర్
చ్చడకోపన్, శొల్
పణిశెయాయిరత్తు
ళ్ళివై పత్తుడన్,
తణివిలర్కఱ్పరేల్
కల్వివాయుమే. ౧౧

జ్ఞాన మనియును మఱియు న - జ్ఞాన మనియు
రెండు లేనియచిత్తు నై - యుండ, నాకు
జ్ఞానము నొసంగి పుండరీ - కములబోలు
నేత్రములతోడ నాయందె - నిలిచిపోయి,
మరల నజ్ఞానదశ నన్ను - జొరనియట్లు
రక్షణ మొనర్చు నా నీల - రత్నమందు
మరప దెట్లు జనించు నా - మానసమున.　　10

రత్నదీప్తులతో శరీ - రంబు మెరయ
నిత్యసూరులకెల్లను - నేత యగుచు
తనకు దానె యలంకార - మనగ జెల్లు
స్వామివింగూర్చి కురుకూరు - సమ్మునీంద్రు
డైన నమ్మాళువారి స - హస్రసంఖ్య
పాశురంబులలోన నీ - పదిని భక్తి
బరన మొనరించువారి కీ - పాశురములె
సర్వశుభముల సతతంబు - సంఘటించు.　　11

# తిరువాయ్ మొఴి

## ఇరణ్డామ్పత్తు

## ముదల్ తిరువాయ్ మొఴి

(మూలమ్)

వాయుమ్ తిరై యుగళుమ్
కానల్ మడనారాయ్,
ఆయుమమరులగు
తుఞ్జిలుమ్ నీతుఞ్జాయాల్,
నోయు మ్పయలై మైయుమ్
మీదుర వెమ్మేపోల్
నీయుమ్ తిరుమాలాల్
నెఞ్జమ్ కోట్పట్టాయే.

కోట్పట్ట శిన్దైయైయాయ్
కూర్వాయ వన్రిలే,
శేట్పట్ట యామఙ్గళ్
శేరాదిరఙ్గుదియాల్,
ఆట్పట్టవెమ్మేపోల్
నీయు మరవణైయాన్,

# శ్రీ ముఖ సూక్తి

## ద్వితీయ శతకము

## ప్రథమ దశకము

(విశ్లేషబాధ)

భంగనిశ్రేణు లొండొండ – పరుగులెత్తు
జలధితీరసంచారి వౌ – సారసంబ!

*   *   *

అనిమిషత్వంబు కన్నుల – కమరియున్న
నిత్యసూరుల కైనను – నిద్ర వచ్చు;
తనయుదుఃఖంబుతో గ్రుంగు – తల్లి కైన
నిద్ర వచ్చిన రావచ్చు, – నీకు రా ద
దేల! నీశరీరం బిట్లు – పాలిపోయె!
అకట! నీ కేల యీమనో – వ్యాధి గలిగె!

*   *   *

నా మనమువోలె వైకుంఠ – నాయకుండు
లీల నీమనమును దొంగి – లించెనొక్కొ 1

క్రూరగానం బొనర్చెడు – గోరువంక!
వామనబ్రహ్మచారి ని – న్నేమి చేసె?
కపట మొనరించి నీమన – స్సపహరించె
గావలయు; లేనిచో నిద్ర – పోవకయె వి
చారపడ నేల వేకువ – జామువరకు;

*   *   *

తాట్పట్ట తణ్డుழాయ్
త్తామ జ్ఞానముంగ్రళే. ౨

కాముఱుం కైయ్యఱవోన్
డెల్లేఇరాప్పగల్,
నీముఱుం కణ్ణియులాయ్
నెఞ్జురుగి యేఙ్గుదియాల్,
తీముఱుం త్తెన్నిలఙ్గై
యూట్టినాన్ తాళ్ నయన్ద,
యాముఱుం దుఱ్ఱయో
వాழிక నైకడలే. ౩

కడాలు మ్మలైయుమ్
విశుమ్బుమ్ తుழாయ మొన్పాల్,
శుడర్ కొళిరాప్పగల్
తుఞ్జాయాల్ తణ్ వాడాయ్,
అడల్ కొళ్ పడైయాழி
యమ్మానై క్కాణ్బాన్ నీ,
ఉడలమ్ నోయుఱ్ఱాయో
వూழிతోఱూழியే. ౪

ఊழிతోఱూழி యులగుక్కు నీర్ కొణ్డు,
తోழியరుమ్ యాముమ్ పోల్ నీరాయ్ నెగిழ்గిన్ఱ,

శేషశాయి దాస్యంబునం - జేరినట్టి
నావలెనె నీవు దచ్చర - ణముల నున్న
తులసి కాశింప నీస్థితి - గలిగెనొక్కొ! 2

ఏమి పోగొట్టుకొంటివో - యింతపెద్ద
శబ్ద మొనరించి యార్చుచు - సాగరంబ!
రేయిబవళు లొకింత ని - ద్రింప వైతి!

* * *

లంక తుద ముట్ట గూల్చిన - రామభద్రు
పాదసన్నిధికై యాస - పడి లభింప
నేరమిం గుందుననుబోలె - నీవుగూడ
విరహమునకు బాల్పడితివో - వేచివేచి

* * *

శీఘ్రమున నీకభీష్టసం - సిద్ధి యగుత
గాన దుఃఖంబు మాని సు - ఖంబు గనుము. 3

చంద్రసూర్యులచే బ్రకా - శంబు గాంచు
రాత్రియును బవ ల్నిద్దుర - రాదె నీకు?

* * *

ప్రబలచక్రంబు ధరియించు - స్వామిదర్శ
నం బభిలషించి, జలధిలో - నగములందు
గగనమం దెల్ల వెదకియు - గాన లేక
కాయ మున్నంతవర కెడ - బాయనట్టి
మన్మథారిని బొందితో - మారుతంబ! 4

కల్పకల్పంబు నందును - గరగికరగి
జగముల న్నీట నింపెడు - జలద మయ్యొ,

వాఴియవానమే నీయుమ్మదుసూద఩్,
పాఴిమైయిల్ పట్టవర్కణ్ పాశఱ్ఱాల నైవాయే. ౫

నైవాయ వెమ్మైపోల్ నాణ్మదియే నీయిన్నాళ్,
మైవానిరుళగఱ్ఱాయ్ మాఴాన్దు తేమ్బుదియాల్,
ఐవాయరవణై మేలాఴిప్పెరుమానార్,
మెయ్వాశగఙ్గేట్టు఩్ మెయ్నీర్మై తోఱ్ఱాయే. ౬

తోఱ్ఱోమ్ మడనెఞ్జమెమ్బెరుమా఩్ నారణఱ్కు, ఎమ్
ఆఱ్ఱామై శొల్లి యఴువోమై నీనడువే,
వేఱ్ఱార్వగైయిలు అక్కడిదాయునైయూఴి,
మాఱ్ఱా఩్మై నిఱ్ఱియో వాఴికనైయిరుళే. ౭

ఇరుళి఩్ తిణివణ్ణమ్మానేర్ కఴియేపోయ్,
మరుళుఱ్ఱిరాప్పగల్ తుఞ్జిలుమ్నీ తుఞ్జాయాల్,
ఉరుళుమ్ శగడముదైత్త పెరుమానార్,
అరుళి఩్ పెరునశైయాలాఴాన్దు నొన్దాయే. ౮

స్వామిచేష్టితములకు లో - బడుచు వాని
బొందనేరక దుఃఖంబు - బొందితౌర !
నాయవస్థయె నినుగూడ - నావరించె. 5
ఆకసంబున జీకటు - లల్లలాడ
బాలచంద్రమ! నీ విప్పు - డేల కాంతి
హీనతను బొంది క్షీణించి - యిట్టు లుంటి?

*          *          *

చక్రివచనంబులను విని - సమ్మతించి
శేషశయనుం డబద్ధంబు - చెప్ప డనుచు
నెద దలంచి నావలె గృశి - యించితొక్కొ ! 6
మానసంబులు శ్రీపతి - స్వామి కిచ్చి
విరహవేదన దపియించు - వేళ, సంధ
కారమా ! నీవు మామీద - గ్రౌర్య మూని
యొకరిముఖ మొక్కరికి గాన - కుండు తెరగు
చేసితివి గాదె, యరులు హా - సించునట్లు ;

*          *          *

ఐన నే మాయె? సుఖము నీ - వైన గనుము! 7
కటికిచీకట్లు ప్రవహించు - కరణి నీల
కాంతి జలముల జనునుప్పు - గాల్వ! నీవు
జ్ఞానశూన్యత రేయింబ - గళ్లు నిద్ర
మాని దుఃఖింతు వీరీతి - దేనికొరకు ?
చక్ర మై దొర్లుశకటరా - క్షసుని దన్ని
గ్రామమెల్లను నిష్కంట - కము నొనర్చు
స్వామిసౌశీల్యమును మాన - సమున దలచి
విరహమును బొంది బాధల - బొరయుదొక్కొ ! 8

నోన్దారా క్కాదల్ నోయ్ మెల్లావి యుళ్ళులర్త్త.
నన్దావిళక్కమే నీయుమళియత్తాయ్,
శెన్దామరై త్తడఙ్కణ్ శెఙ్కనివా యెమ్బెరుమాన్,
అన్దామ త్తణ్బుళా యాశైయాల్ వేవాయే. ౯

వేవారా వేట్కైనోయ్ మెల్లావియుళ్ళులర్త్త,
ఓవాదిరాప్పగ లున్బాలే వీళ్త్తొళిన్దాయ్,
మావాయ్ పిళన్దు మరుదిడై పోయ్ మణ్ణళన్ద,
మూవాముదల్వా వినియెమ్మై చ్చోరేలే. ౧౦

శోరాద వెప్పొరుట్కు మాదియామ్ శోదిక్కే,
ఆరాదకాదల్ కురుగూర్ చ్చడకోపన్,
ఓరాయిరమ్శొన్న వవఱ్ఱుళ్ ళివై పత్తుమ్,
శోరార్విడార్ కణ్డీర్ వైకున్దమ్ తిణ్ణనవే. ౧౧

ఎడ తెగక మండుదీపమా! - యెంతకాల
మనుభవించిన దీరని - దైన నీదు
ప్రాణమున కాశ యనియెడు - వ్యాధి గల్గె

* * *

లోకనాయకు సితపుండ - రీకనేత్ర
ముల జెలంగెడి సౌందర్య - మును దలంచి,
లలితమాధుర్యబింబాధ - రము జపించి
అతులతులసీదళంబుల - కాస జెంది
భగ్నమానస వై యిట్లు - బాధపడెదో! 9
ఆరిపోవక మండెదు - వ్యాధి యనగ
నాశ నామృదుప్రాణంబు - నందు దగిలి
కరగ దీసెడి, రేయింబ - గళ్లు నన్ను
మనము నీరూపమున జిక్కు - కొనుటవలన ;

* * *

గుజ్జు మగుకేశి రాక్షసు - గూల్చినావు
మద్దిచెట్లయౌన్నత్యంబు - మాన్పినావు
కువలయం బొక్క పాదాన - గొల్చినావు
సర్వలోకంబులను సృష్టి - సలిపినావు
నిరతయౌవనసుందరా! - నీరజాక్ష!
ఓ శ్రియఃపతి నను వీడ - కుండుమయ్య! 10
సర్వకారణు డైనయా - సరసిజాక్షు
నెం తనుభవించినను దృప్తి - యెరుగనట్టి
పరమభక్తుండు నమ్మాళు - వారు వ్రాయు
పాశురసహస్రసంఖ్య నీ - పది పఠించు
భక్తజనములు విడువరు - పరమపదము. 11

ఇరణ్డామ్ పత్తు

# ఇరణ్డామ్ తిరువాయ్ మొఴి

(మూలమ్)

తిణ్ణన్ వీడుముదల్ ముఴుదుమాయ్,
ఎణ్ణిన్ మీదియ నెమ్బెరుమాన్,
మణ్ణుమ్ విణ్ణు మెల్లా ముడనుణ్డ, నఙ్
కణ్ణన్ కణ్ణల్ల దిల్లై యోర్ కణ్ణే. ౧

ఏపావమ్పరమే యేఴులగుమ్,
ఈపావఞ్జెయ్ దరుళా లళిప్పారార్,
మాపావమ్విడ వరఱ్కు ప్పిచ్చైప్పెయ్,
కోపాల కోళరియే ఱన్ఱియే. ౨

ఏఱనై ప్పూవనై ప్పూమగళ్ తన్నై,
వేఱిన్ఱివిణ్ తొఴ త్తన్నుళ్ వైత్తు,
మేల్ తన్నై మీదిడ నిమిర్న్దు మణ్ కొణ్డ,
మాల్ తనిల్ మిక్కు మోర్ తేవుముళదే. 3

ద్వితీయ శతకము

## ద్వితీయ దశకము

(సర్వేశ్వరత్వోపదేశము)

మోక్షమే గాక తదితర - పూరుషార్థ
ములను నెల్లను నొసగుదే - వుండతండు;
బహుళకల్యాణసుగుణసం - పత్కరుండు;

* * *

అఖలభువనంబులకును సం - హారకర్త
అట్టిస్వామిని శ్రీకృష్ణు - ననగవలయు
రక్షకుం డని; వే రొండు - రక్షకుండు
గలుగ డెందేని సర్వజ - గంబులందు. 1

బ్రహ్మహత్య నొనర్చి క- పాలహస్తు
డైన రుద్రునికిం భిక్ష - నందియిచ్చి
వానిపాపంబు బాపి కా - పాడినట్టి
గోపకులసింహు డగుబాల - కుండె సప్త
లోకముల బాపములనుండి - ప్రోచువాడు;

* * *

ఇంకొకని కట్టిసామర్థ్య - మెట్టు లుండు;
శ్రీపతిగుణంబు లేను వ - ర్ణింపవలెనె. 2

గోపతిని వాహనంబుగా - గొన్నరుద్రు;
పంకజమునందు బుట్టిన - బ్రహ్మదేవు,
అఖలభువనైకమాత యా - యబ్ధిసుతను
హెచ్చుతగ్గులు గణియింప - నెల్లయపుడు

తేవుమెప్పొరుళు మ్పడైక్క.
పూవిల్ నాన్ముగనై ప్పడైత్త,
తేవనెమ్బెరుమాను క్కల్లాల్,
పూవు మ్పూశనై యుమ్ తగుమే. ౪

తగుమ్శీర్ త్తన్ తనిముదలినుళ్ళే,
మిగుత్తేవు మెప్పొరుళు మ్పడైక్క,
తగుమ్కోల త్తామరై క్కణ్ణ నెమ్మాన్,
మిగుమ్శోది మేలఱివార్ యవరే. ౫

యవరుమ్యావైయు మెల్లాప్పొరుళుమ్,
కవర్విన్ఱి త్తన్నుళ్ ళొడుఙ్గనిన్ఱ.

తన శరీరంబునం దుంచు - కొనెడివాడు ;

*　　*　　*

అమరులగు నిత్యసూరుల - కాశ్రయుండు ;
లోకముల బాధముల గొల్చు - రూప మెత్తి
యూర్ధ్వలోకంబులను మించు -నున్నతుండు ;

*　　*　　*

ఇట్టి శ్రీకృష్ణుకంటె ను - త్కృష్ట దేవడు
ఈతడే సర్వలోకాళి - కీశ్వరుడు. 3

సురలు మొద లగుసర్వవ - స్తువుల గలుగ
జేయు మని నాభినిం బ్రహ్మ - సృష్టిచేయు
పరమపూరుషు డైన నా - స్వామి దప్ప
బూజ్యు డెవ్వఁడు నాచేతి - పుష్పమునకు. 4

ఉచితకల్యాణగుణముల - నున్నతుండు,
అద్వితీయసంకల్పంబు - నధివసించి
అమరు లాది యాభూతజా - లముల సృష్టి
నాటకం బాడు నతులితా - నందమూర్తి,
ఈశ్వరత్వంబు కమలప - త్రేక్షణముల
జగతికిం జూపుభూపాల - చక్రవర్తి,
పాపముల మాపుజ్యోతిస్స్వ - రూపవర్తి
వేదవేదాంతవాక్యసం - వేద్యదీప్తి
విమలసత్కీర్తినాస్వామి - విష్ణుమూర్తి !

*　　*　　*

అతనిసముడు లే డన్నచో - నధికు డున్న ? 5
సకల చేతనాచేతన - సంతతులును
ఇరుకు లేకుండ దనయందె - యిమిడియుండ

పవర్ కొళ్ ఞానవెళ్ళ చ్చుడర్ మూర్త్తి,
అవరెమ్మాఴి యమ్పళ్ళియారే. ౬

పళ్ళియాలిలై యేఴులగుమ్ కొళ్ళుమ్,
వళ్ళల్ వల్ వయిఱ్ఱు ప్పెరుమా౯,
ఉళ్ళుళా రఱివా రవన్ఱ౯,
కళ్ళమాయ మనక్కరుత్తే. ౭

కరుత్తిల్ తేవు మెల్లాప్పొరుళుమ్,
వరుత్తిత్త మాయప్పిరానై యన్ఱి యారే
తిరుత్తి త్తిణ్ణిలై మూవులగుమ్ తమ్ముళ్
ఇరుత్తిక్కాక్కు మియల్వినరే. ౮
కాక్కు మియల్విన౯ కణ్ణపెరుమా౯,
శేర్క్కై శెయ్దు తన్నున్దియుళ్ళే,
వాయ్త్త తిశైముగ నిన్దిర౯ వానవర్.
ఆక్కినా౯ తెయ్వ వులగుగళే. ౯

కళ్వా వెమ్మైయు మేఴులగుమ్, ని౯
ఉళ్ళేతోఱ్ఱియ ఇఱైవ వెన్ఱు,
వెళ్ళేఱ౯ నాన్ముగ నిన్దిర౯ వానవర్.
పుళ్ళూర్దికఴల్ పణిన్దేత్తువరే. ౧౦

నతివిశాలంబు జ్ఞానమ - యంబు దివ్య
కాంతియుక్తంబు నగుమేను - గలిగినట్టి
నా శ్రియఃపతి క్షీరాబ్ధి - నడుమ మఱ్ఱి
యాకుపై శయనించిన - యాదిమూర్తి. 6
అట్టి వటపత్రశాయి గ - ర్భాంతరాళ
మతివిశాల మై న ప్తలో - కాళి నిలువ
దగుప్రదేశంబు గలది యై - దనరుచుండు ;
వానిసంకల్ప మెవ్వని - కేని యెఱుగ
దుర్లభంబును నాశ్చర్య - ధుర్యము నగు. 7
ఎద దలంచినమాత్రాన - నెల్లజగతి
సృష్టి యొనరింప జాలు న - ర్వేశ్వరుండు
దక్క, భువనత్రయంబు ను - ద్ధరణచేసి
రక్షణ మొనర్చి కాపాడు - దక్షు డెవడు? 8
తనస్వభావంబు రక్షక - త్వంబు గనుక
జగతి రక్షింప యాదవ - జన్మ మెత్తి
నట్టి శ్రీకృష్ణమూర్తియే - యఖిలదేవ
భూతజంగమస్థావర - జాతములకు
బ్రహ్మరుద్రేంద్రదేవతా - ప్రభృతులకును
లయము నొనరించి సృష్టించి - రక్ష నిచ్చి
పృథివి పాలించుచుండు న - ర్వేశ్వరుండు. 9
"మహిమలను దాచి గన్పించు - మాన్యరూప
తలచినంతనె భువనకో - టులను మమ్ము
సృష్టి చేయు సమర్థత - జెలగు దేవ!"
యని స్తుతింతురు బ్రహ్మరు - ద్రాదిసురలు,
గరుడవాహను పదపద్మ - కాంతి చూచి. 0

ఏత్తవేఴ్ఴులగు ఞ్ణ్ణ క్కోలక్
కూత్తనై, క్కురుగూర్ చ్చడకోపన్ శొల్,
వాయ్ త్తవాయిరత్తు ళ్ళివై పత్తుడన్,
ఏత్తవల్లవర్ క్కిల్లై యోరూనమే, ౧౧

## ఇరణ్డామ్పత్తు

## మూన్ఱామ్ తిరువాయ్ మొఴి

(మూలమ్)

ఊనిల్ వాఴ్ఴుయిరే నల్లై పో
 ఉన్నై ప్పెఱ్ఱు,
వానులార్ పెరుమాన్
 మదుశూద నెన్నమ్మాన్,
తానుమ్ యానుమెల్లామ్
 తన్నుళ్ళే కలన్దొఴిన్దోమ్,
తేనుమ్పాలుమ్ నెయ్యుమ్
 కన్నలు మముదుమొత్తే. ౧

ఒత్తార్ మిక్కారై
 యిలైయాయ మామాయా
ఒత్తా యెప్పొరుట్కుమ్
 ముయిరాయ్, ఎన్నై ప్పెఱ్ఱ

భక్తితోడ త్రివిక్రము - పాదపూజ
గా రచించిన నమ్మాళ్వు - వారివేయి
పాశురముల నీపది శ్రద్ధ - బఠనచేయు
నరుల కెన్నడు దేవతాం - తరపరత్వ
బుద్ధి జనియింప నోపదు - భువనమందు. 11

---

ద్వితీయ శతకము

తృతీయ దశకము

(ధ్యానము)

నాశరీరమం దున్నమా - నసము ! నిత్య
సూరులకు స్వామి నా మన - స్సుందరుండు
నైనమధుసూదనుం గూడి - యాడి మిగుల
ననుభవించితి మధురంబు - లన్ని యొక్క
సారిగనె మధురశర్కరా - క్షీరములను
అమృతమును ఘృతమునుగూడ - నతనియందె;
యొడలు తెలియనియానంద - మొప్పుచుండ

* * *

నీసహాయంబు గాదె యి - న్నిటి కౌసంగె. 1

నిన్ను మించెడివాడు లే - డన్నమాట
యిది సరియ గాని నీసముం - డేని గలడె !

* * *

మనుజు డాది యగా వస్తు జ - న్మంబు లెత్తి

అత్తాయ్యాయ్ త్తన్దైయా
యఱియాదన వఱివిత్త
అత్తా, నీశెయ్దన
వడియేనఱియేనే. ౨

అఱియాక్కాలత్తుళ్ళే
యడిమైక్కణన్బుశెయ్విత్తు,
అఱియా మామాయ
త్తడియేనై వైత్తాయాల్,
అఱియామైక్కుఱళాయ్
నిలమ్మావలి మూవడియెన్ఱు,
అఱియామైవఞ్జిత్తా
యెనదావియుళ్కలన్దే. 3

ఎనదావియుళ్ కలన్ద
పెరునల్లుదవి క్కైమ్మాఱు,
ఎనదావి తన్దొழிన్దే
ననిమీళ్వ దెన్బదున్డే,

భక్తకోటికి దర్శన - ప్రాప్తి నొసగి
ప్రాణ మై చేసితివి జగ - ద్రక్షణంబు!

* * *

తల్లి వై నన్ను సృజియించి - తండ్రి వగుచు
సర్వవిధముల నను రక్ష - సలుపుచుంటి

* * *

మూఢునికి నాకు జ్ఞానంబు - మొలకలెత్త
జేసినాడవ వాచార్యుండు - చేసినట్లు

* * *

నీ వొనర్చిన యుపకార - నిచయములను
లెక్కిడగ నేర్తునే ఘుండ - రీకనేత్ర! 2

పరు లెఱుంగని దివ్యరూ - పంబు దాల్చి
వామనుడ వౌచు బలిచక్ర - వర్తి జేరి
గురునివచనంబు లాతని - జొరనిరీతి
నడిగికొంటివి నేల మూ - డడుగు లీవు!

* * *

నీమహత్త్వం బెఱుంగని - నామనస్సు
నం బ్రవేశం బొనర్చి జ్ఞా - నం బొసంగి
నిన్ను స్మరియించుటే నాకు - నిత్యజీవ
నముగ జేసితిగాదె ప్రా - ణంబ వగుచు. 3

సర్వలోకసంహార! నా - స్వామి! నీవు
నను గలసి యున్న సౌఖ్యంబు - ననుభవించి
బదులుగా నుపకారంబు - మది దలంచి
ఆత్మ నర్పణం బొనరించి - తయ్య! నీకు;

ఎనదావియావియుమ్ నీ
పొఴిలేఴు ముణ్డవెన్దాయ్,
ఎనదావియార్ యానార్
తన్దనీకొ ణ్డాక్కినైయే. ౪

ఇనియార్ ఞానఙ్గళా
లెడుక్క లెఴాద వెన్దాయ్,
కనివార్ వీట్టిన్బమే
యెన్కడల్పడా వముదే,
తనియేన్ వాఴ్ముదలే
పొఴిలేఴు మేన మొన్ఱాయ్,
నునియార్ కోట్టిల్వైత్తా
యునపాదమ్ శేర్న్దనే. ౫

శేర్న్దార్ తీవినైగట్కరునఞ్జై త్తిణ్మదియై,
తీర్న్దార్ తమ్మనత్తు ప్పిరియా దవరుయిరై,
శోర్న్దేప్పుగల్ కొడాచ్చుడరై యరక్కియై మూక్
కీర్న్దాయై, అడియేనడైన్దే న్ముదల్ మున్నమే. ౬

తెలిసికొంటిని నిశ్చయ - స్థితిని బిడప
సర్వావస్థాంతరాత్మ వౌ - స్వామి వగుట
ఆత్మలకు నాత్మవును - శేషి - వగుట వగుట :

* * *

కనుక నీసొత్తు నీ కిచ్చి - తని వచింప
నే నెవండను ? నీసొత్తు - నీవ కొంటి. 4

జ్ఞానమాత్రంబుచే నెట్టి - జ్ఞానులేని
యరయ జాలరు ; భక్తుల - కట్లుగాక
కొంగుబంగార మై నీవు - గూర్తుగాదె!

* * *

రిత్తయమృతంబునకు గొండ - నెత్తి సురలు
జలధిమథనం బొనర్పగా - వలసె నాడు ;
అట్టిసుధకంటె వేయిరె - ట్లధిక మైన
సుధ యనగ ని న్ననుభవించు - సుఖము నాకు
జిక్కె నూరక యే స్వత - స్సిద్ధ మగుచు ;

* * *

ఓ వరాహస్వరూప ! నీ - వుద్ధరింప
నీపదంబుల సన్నిధి - నేను గంటి. 5

ఆశ్రితుల క్రూరపాపంబు - లడచి, వారి
మనము లుత్కృష్టపథముల - బనుచువాడు ;
వారి దుఃఖంబులెల్లను - బారదోలి
కష్టములు గల్గ నీయక - కాచువాడు;
దానవాంతకు సుగుణంబు - లే నెరింగి
యుంటి వానిపదాశ్రయం - బొంది యుంటి. 6

మున్నల్ యాఴ్పయిల్ నూల్
నరమ్బిన్ ముదిర్ శువైయే,
పన్నలార్ పయిలు
మ్పరనే పవిత్తిరనే,
కన్నలే యముదే
కార్ముగిలే యెన్ కణ్ణా,
నిన్నలా లిలేన్కాణ్
ఎన్నైనీ కుఱిక్కొళ్ళే, ౭

కుఱిక్కొళ్ ఞానఙ్గళా
లెనై యూఴి శెయ్ దవముమ్,
కిఱిక్కొణ్డిప్పిఱప్పే శిలనాళి
లెయ్ దినన్ యాన్,
ఉఱిక్కొణ్డ వెణ్ణెయ్ పా
లొళిత్తుణ్ణుమమ్మాన్ పిన్ ;
నెఱిక్కొణ్డ నెఞ్జనాయ్
ప్పిఱవిత్తుయర్ కడిన్దే. ౮

లలిత మధుర విపంచికా - రవ సుధార
సంబు లాలికించుతంత్రుల - శ్రావ్యగాన
సంపద లొసంగు భోగ్యర - సంబువాడు

* * *

వివిధవిజ్ఞానసద్భ క్తి - వితతి యనుభ
వంబుచే దరుగని మహి - మంబువాడు

* * *

పరమపావనమూ ర్తి యై - చెరకురసము
కంటె నమృతంబుకంటె శ - ర్కరలకంటె
నధికమైన మాధుర్యంబు - లలరువాడు

* * *

నీలమేఘంబు లను మించు - డాలువాడు

* * *

వాని గూడక యొకక్షణం - బేని నిల్వ
నేర నాయండనే వాడు - నిలువవలయు. 7

మరుగుస్థలములలోన నే - మరక దాగి,
గోపకాంత లుట్టులయందు - గూడబెట్టు
కొనెడు వెన్నను బాలను - గొని తినంగ
నేర్పుకాడైన నానవ - నీతచోరు
డాహవముఖంబునం బార్థు - కానతిచ్చు
విద్య యైన ప్రపత్తిని - స్వీకరింప
గడిదిసంసారదుఃఖంబు - కరగిపోయె ;

* * *

యమము మొదలుగా గల సాధ - నములవలన
వరతపోజ్ఞానసద్విధా - చరణవలన,
బడయ దగినఫలం బెల్ల - స్వల్పకాల
ముననె స్వామియనుగ్రహ - మున లభించె. 8

కడివార్ తణ్ణన్దుழాయ్
కణ్ణన్ విణ్ణవర్ పెరుమాన్,
పడివానమిఱన్ద పరమన్
పవిత్తిరన్ శీరన్,
శెడియార్ నోయ్‌గళ్ కెడ
పడిన్దు కుడైన్దాడి,
అడియేన్ వాయ్‌మడుత్తు
ప్పరుగి క్కళిత్తేనే. ౯

కళిప్పుఙ్ కవర్వుమత్తు
ప్పిఱప్పు ప్పిణిమూప్పిఱప్పత్తు,
ఒళికొణ్డ శోదియుమాయ్
ఉడన్కూడువ దెన్ఱుకొలో,
తుళిక్కిన్ఱ వానిన్నిలమ్
శుడరాழி శఙ్గేన్ది,
అళిక్కిన్ఱ మాయప్పిరా
నడియార్గళ్ కుழాఙ్గళైయే. ౧౦
కుழాఙ్గొళ్ పేరరక్కన్ కులమ్‌కెడ మునిన్దవనై,
కుழాఙ్గొళ్ తెన్కురుగూర్ చ్చడగోపన్ తెరిన్దురైత్త,
కుழాఙ్గొళాయిరత్తుళ్ ళివై పత్తు ముడన్పాడి,
కుழాఙ్గళా యడియీరుడన్ కూడినిన్ఱాడుమినే. ౧౧

పరమభోగ్యుండు సర్వ దే - వప్రభుండు
సకల కల్యాణ సుగుణ సా - క్షాత్కరుండు
అతిమనోహరతులసిమా - లాన్వితుండు
పరమపదవాసి యసమాన - పావనుండు
అఖిలమునకును నుత్కృష్టు - డైన కృష్ణు
పాదపద్మంబులకు సమీ - పమున జేరి,
యచట గల్గు సుధా ప్రవా - హమున మునిగి
నా విదాహంబు పోవ గా - నం బొనర్చి
వాని కే దాస్య మొనరించు - వ్రతము బూని
భోగి నై యుంటి నానంద - సాగరమున. 9
విషయ సుఖదుఃఖయోగంబు - విడిచిపెట్టి
జనన మరణ జరా రోగ - సమితి బాసి
రమ్యతేజోమయపు శరీ - రంబుతోడ,
శంఖ చక్ర గదా ఖడ్గ - సహితుడైన
యద్భుతాశ్చర్యచేష్టితా - నంతగుణుని
యుజ్జ్వలాంఘ్రిసరోరుహ - యుగము చెంత
నిత్య సూరుల సన్నిధి - నిత్యదివ్య
దేహుసన్నిధి నివసించు - దిన మదెపుడో! 10
ధనతపఃపరివారదు - ర్దాంతగలస
మగ్రుడౌ పంక్తి కంఠుని - మ్రంద జేసి
విశ్వరక్షణ చేయు స - ర్వేశ్వరునకు
తిరునగరిమాని వ్రాయు పా - శురసహస్ర
పంక్తియందలి యీపది - పాశురముల
బఠన మొనరింప గలుగు స - ద్భక్త జనులు
నిత్యసూరుల జేరెదు - నేర్పు గాంత్రు. 11

## ఇరణ్డామ్పత్తు

## నాలామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

ఆడియాడి యగఙ్కరైన్దు, ఇశై
పాడిప్పాడి క్కణ్ణీర్ మల్గి, ఎఙ్గుమ్
నాడినాడి నరశిఙ్గా వెన్ఱు,
వాడివాడు మివ్వాణుదలే. ౧

వాణుద లిమ్మడవరల్, ఉమ్మైక్
కాణుమాశైయుళ్ నైగిన్ఱాళ్, విఱల్
వాణ నాయిరన్దోళ్ తుణిత్తీర్, ఉమ్మైక్
కాణ నీరిరక్కమిలీరే. ౨

ఇరక్కమనత్తో డెరియణైయ,
అరక్కుమెఴుగు మొక్కుమివళ్,
ఇరక్క మెఴీ రిదఱ్కెన్ శెయ్గేన్,
అరక్కనిలఙ్గై శెఱ్ఱీరుక్కే. 3

## ద్వితీయ శతకము

## చతుర్థ దశకము



(దూతికా సందేశము)

స్వామి! యీసుందరాంగి నీ - సమ్ముఖమును
బాసి యుండుటచే మనో - భ్రమము చెంది
నాట్య మొనరించు నీసద్గు - ణముల దలచి
పాటలం బాడు నీస్తోత్ర - పాఠముగ
బాష్పజలపూరితాక్షి యై - పద్మనయను
డెచట నున్నాడని యన్ని - యెడల వెదకు
నారసింహా! యటంచు స - న్నగిలి పల్కు
ఇట్టి విరహంబుచే గృశి - యింప దగునె? 1
ఓ శ్రియఃపతి! నిను బాసి - యుంటవలన
వనజనయనశరీరంబు - వాడిపోయె;
మార్దవోపేత మీనాతి - మానసంబు
విరహవేదనతో గ్రుంగి - కరగ జొచ్చె;
అతివదుఃఖోపశమనంబు - మతి దలంచి
బాణవైరి! నీదర్శన - భాగ్య మిమ్ము! 2
ప్రాయిల్యప్రక్కన మైనంపు - బొమ్మవోలె
గానిచో లక్కపిండంబు - కరణి నతివ
విరహవేదనవహ్నిలో - గరగు చుండ
మీరు దయ జూపి చేకొన్న - వారు గారు;
లంక తుద ముట్ట గాల్చిన - రామచంద్ర!
ఏయుపాయంబుచేత నిం - కీమె దక్కు. 3

ఇలఙ్గైశెఱ్ఱవనే యెన్నుమ్, పిన్నుమ్
నలఙ్గొళ్ పుళ్ళుయర్త్తా యెన్నుమ్, ఉళ్ళమ్
మలఙ్గ వెవ్వుయిర్క్కుమ్, కణ్ణీర్ మిగక్
కలఙ్గి క్కైతొழுమ్ నిన్ఱివళే. ౪

ఇవళిరాప్పగల్ వాయ్ వెరీఇ, త్తన
కువళై యొణ్ కణ్ణనీర్ కొణ్డాళ్, వణ్డు
తివళు న్తణ్ణన్తుழாయ్ కొడీర్, ఎన
తవళవణ్ణర్ తగవుగళే, ౫

తగవుడైయవనే యెన్నుమ్, పిన్నుమ్
మిగవిరుమ్బుమ్ పిరా నెన్నుమ్, ఎన
తగవుయిర్ క్కముదేయెన్నుమ్, ఉళ్ళ
ముగవురిగి నిన్ఱుళ్ళుగే. ౬

ఉళ్ళుళావి యులర్న్దులర్న్దు, ఎన
వళ్ళలే కణ్ణనేయెన్నుమ్, పిన్నుమ్
వెళ్ళనీర్క్కిడన్దా యెన్నుమ్, ఎన
కళ్ళిత్తాన్పట్ట వఞ్జనైయే, ౭

వఞ్జనేయెన్నుమ్ కైతొழுమ్, తన
నెఞ్జమ్వేవ నెడిదుయిర్క్కుమ్, విఱల్

"లంక దహనం బొనర్చిన - రామచంద్ర!
గరుడవాహన మెక్కెడు - పరమపురుష!"
యనుచు స్మరియించు చుండు నీ - వనరుహాక్షి
యుల్లమున దుఃఖపడుచు ని - ట్టూర్పు విడుచు;
బాష్పజలపూరితాక్షి యై - భక్తి నీకు
వందనములు సమర్పించు - గుందిగుంది; 4

రేయివగలును నిన్ను స్మ - రించుకొనుచు
సుందరము లైన నేత్రము - ల్బిందుపూరి
తములుగా సంచరించెడు - తలిరుబోడి
కొక్కతులసీదళము నీది - చిక్క దాయె;
ఇట్టితరి నీదయాగుణం - బెచటి కేగె? 5

కాంతమనము నశించెసి - కరగి కరగి;
"దయ దలిర్చెడు హృదయంబు - దాల్చువాడ!
అఖిల భక్తాళియెడల ద - యార్ద్రహృదయ!
ఆత్మ నుద్ధరణ మొనర్చు - నమృతమయుడ!"
అనుచు విరహాబ్ధి మునుగు నీ - యమ్మయెడల
కొంత యైనను దయ దాల్చి - కొనగరాదె! 6

హృదయమందలి ప్రాణంబు - లెండిపోయె;
"నామహోపకారకుడ! కృ - ష్ణా" యటంచు,
"అబ్ధిజలవటపత్రశ - యాన" యనుచు
గలవరించుచు నున్నయీ - కన్యతాప
మెరుగజాలక పోయితి - విన్నినాళ్లు. 7

కంససంహార! యీశుద్ధ - కాంత నిన్ను
దూరుచున్నది, "గుణముల - సౌరు జూపి

కణ్ణనై వణ్ణనై శెయ్దీర్, ఉమ్మై
త్తణ్ణమె న్నివళ్ పట్టనవే. ౮

పట్టుప్పో దెழుపోదఱియాళ్, విరై
మట్టలర్ తణ్డుழాయెన్నుమ్, శుడర్
వట్టవాయ్ నుదినేమియీర్, నుమ
దిట్టమెంగో లివ్వేழైక్కే. ౯

ఏழైపేదై యిరాప్పగల్, తన
కేழిలొణ్ కణ్ణనీర్ కొణ్డాళ్, కిళర్
వాழ్వై వేవ విలంగై శెఱ్ఱీర్, ఇవళ్
మాழై నోక్కొన్ఱుమ్ వాట్టేన్మినే. ౧౦

వాట్టమిల్ పుగழ్ వామననై, యిశై
కూట్టి వణ్ శడగోపన్ శొల్, అమై
పాట్టోరాయిర త్తిప్పత్తాల్, అడి
శూట్టలాగు మన్దామమే. ౧౧

వంచన నొనర్చి నీవు రా - బట్టికొంటి''
వనుచు; నంజలిచేసి క - న్నార నిన్ను
గాంచ జాలమి మిగుల దుః - ఖంబుతోడ
వేడి నిట్టూర్పు లెప్పుడు - విడుచు చుండు;

* * *

సర్వదా యిట్టిదుఃఖ మీ - సరసిజాక్షి
యనుభవింపగవలయునే - యాదిదేవ! 8

చక్రధర! నీదుసంశ్లేష - సౌఖ్యమునకు
గోరి యువ్విళులూరు సీ - కుందరదన
యితరవిషయంబు లెవ్వియు - మతి దలపక,
యనవరత ముదయాస్తమ - యములగూడ
గణన చేయక, నీపాద - కమలయుగము
నందువసియించు తులసినే చేద గోరి
యార్తి జెందెడి; నీతలం - పాన తిమ్మ! 9

చపలచిత్తు రా లైన యీ - సరసిజాక్షి
నేత్రయుగ్మంబునుండి క - న్నీటిధార
కారగా జొచ్చె రేయింబ - గళ్లుగూడ;

* * *

లంక భస్మం బొనర్చు శ్రీ - రామ! యిట్టి
కాంత నేత్రసౌందర్యంబు - గాచుకొనుము! 10

అమలినము లగు సకలక - ల్యాణగుణము
లం బ్రకాశించు వామన - బ్రహ్మచారి
మహిమ వర్ణింప శతకోప - మౌని సర్వ
లక్షణంబులగూర్చి స్తో - త్రం బొనర్చు

ఇరణ్డామ్పత్తు

## ఐన్దామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

అన్దామత్తన్బు శెయ్
దెన్నావి శేరమ్మానుక్కు,
అన్దామవాఴ్ముడిశ
ఙ్గాఴినూలారముళ,
శెన్దామరై త్తడఙ్గణ్
శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్,
శెన్దామరై యడిక్కళ్
శెమ్బొన్ఱిరువుడమ్బే ౧

గాన పాశురములు వేయి - లోన నొక్క
పదిగ రచియించు నీ పది - పాశురముల
బఠన మొనరింప, వామన - పాదతులసి
పొంది యుత్కృష్టపదవిని - జెందగలరు. 11

---

ద్వితీయ శతకము

పంచమ దశకము

(దర్శ - నందము)

సుందరాకారులగు నిత్యు - లందు జేయ
దగిన ప్రీతిని నాయందు - దాల్చి వచ్చి
నామనస్సున జేరు శ్రీ - నాథునందు
అతిమనోహరతులసిమా - ల్యాదిభూష
ణములు జందెంబు మణికిరీ - టము సుదర్శ
నంబు రత్నహారంబు శం - ఖంబు దివ్య
కాంతి దిక్కుల బర్వ బ్ర - కాశ మయ్యె;

*          *          *

కమలపత్రంబులం బోలు - కనులతోడ
బుండరీకదళచ్ఛాయ - మోవితోడ
విమలసరసిజసదృశ పా - దములతోడ
మెఱుగుబంగారువన్నె నె - మ్మేన వెలయు
దివ్యమంగళవిగ్రహ - దీప్తి గంటి. 1

తిరువుడమ్బువాన్ శుడర్
శెన్దామరై క్కణ్ కై కమలమ్,
తిరువిడమే మార్వ
మయనిడమే కొప్పూఴ్,
ఒరువిడము మెన్దై
పెరుమాఱ్కరనేయో,
ఒరువిడ మొన్ఱిన్ఱి
యెన్నుళ్ కలన్దానుక్కే. ౨

ఎన్నుళ్ కలన్దవన్ శెఙ్గనివాయ్ శెఙ్గమలమ్,
మిన్నుమ్శుడర్ మలైక్కుక్కణ్ పాదమ్కై కమలమ్,
మన్నుముఴువేఴులగుమ్ వయిఱ్ఱినుళ,
తన్నుళ్ కలవాద దెప్పొరుళుమ్ తానిల్లైయే. ౩

ఎప్పొరుళుమ్ తానాయ్
మరదగకున్ఱ మొక్కుమ్,
అప్పొఴుదైత్తామరై ప్పూ
క్కణ్ పాదమ్కై కమలమ్,
ఎప్పొఴుదుమ్నాళ్ తిఙ్గ
ళాణ్డూఴియూఴి దొఱుమ్
అప్పొఴుదైక్కప్పొఴు
దెన్నారావముదమే. ౪

ఆరావముదమా
యల్లావి యుళ్ కలన్ద

శ్రీమహాలక్ష్మి వక్షంబు - చేరి యుండ
నలువ నాభికమలమందు - వెలయు చుండ
గడుపునం దొక్క ప్రక్క రు - ద్రుడు వసింప
ఇందరకు స్థాన మైన ర - మేశ్వరుండు,
సకలకల్యాణగుణముల - స్వామి యగుచు
దివ్యమంగళవిగ్రహ - తేజు డగుచు
రమ్యశుభపుండరీకనే - త్రములు గల్గి
కమలదళముల బోలు హ - _స్తములు గల్గి
నాదుహృత్స్థలి వాసం బొ - నర్చె నేడు. 2
జలజనయను డంభోజహ - _స్తములవాడు
కమలముల మించు పాదయు - గంబువాడు
ఎల్లలోకంబులను భరి - యించువాడు
వానిశేషంబు గాని దెం - దేని లేదు
అట్టిసర్వేశ్వరుండు నా - యందు జేరె. 3
ప్రతినిమేషము దనస్వరూ - పంబు నాకు
నమృతమయ మగు పరమభో - గ్యంబు గాగ
సర్వవేళల గ్రొ_త్త లే - జవులు పుట్ట
ననుభవించెద దృ_ప్తి య - న్నదియె లేక ;

* * *

సర్వభూతాత్మ, మరకత - పర్వతంబు,
అతిమనోహరసౌందర్య - మతిశయించు
పుష్పముల బోలునవయవం - బులను గల్గి
భోగ్య మై నన్ను సర్వదా - పొందుచుండు. 4
సాటి లేనట్టి సొగసుల - మూట యగుచు
నీలమేఘముంబోలు మే - నిని ధరించి

కారార్ కరుముగిల్ పో
 లెన్నమ్మాన్ కణ్ణనుక్కే,
నేరావాయ్ శెమ్బవళమ్
 కణ్ పాదమ్ కై కమలమ్,
పేరార నీణ్ముడినా
 ణ్పిన్నుమిఴై పలవే. ౪

పలపలవే యాబరణమ్
 పేరుమ్ పలపలవే,
పలపలవే శోదివడివు
 పణ్బెణ్ణిల్,
పలపల కణ్డుణ్డు
 కేట్టుఱ్ఱు మోన్దిన్బమ్.
పలపలవే ఞానముమ్
 పామ్బణై మేలాఱ్కేయో. ౫

పామ్బణై మేఱ్పాఱ్కడలుళ్ పళ్ళియమర్న్దదువుమ్,
కామ్బణై తోళ్ పిన్నైక్కా యేఱుడ నేఴ్ శెఱ్ఱదువుమ్,
తేమ్బణైయ శోలై మరామరమే ఴెయ్ దదువుమ్,
పూమ్బిణైయ తణ్డుఴాయ్ ప్పొన్ముడియమ్బో రేఱే. ౬

పొన్ముడియమ్బో ఱేఱ్ఱై యెమ్మానై నాఱ్ఱడన్దోళ్,
తన్ముడివొన్ఱిల్లాత తణ్డుఴాయ్ మాలైయనై,
ఎన్ముడివు కాణాదే యెన్నుళ్ కలన్దానై,
శొన్ముడివు కాణేనాన్ శొల్లువదెన్ శొల్లీరే. ౭

పగడమును మించు నధరబిం - బంబు గల్గి
సరసిజము లేని రమతోడ - సమము గాని
కరయుగముతోడ బాదయు - గంబుతోడ
గన్నుగవతోడ నవరత్న - కాంతు లొలుకు
దివ్యభూషణవిలసిత - తేజు డగుచు
సర్వదా నాదుహృత్థ్సలి - సంచరించు. 5

నామనులు లెక్క పెట్ట న - నంతము లగు
నాభరణజాల మట్లె రూ - పాదు లట్లె

*　　　*　　　*

కనుల గను చున్న వీనుల - వినుచు నున్న
జుంబనాదుల బచరించి - సొలయు చున్న
దర్శనంబున మరియు సం - స్పర్శనమున
జ్ఞానవిషయంబునందు వా - సనలయందు
క్షణక్షణము మారు మకరంపు - జవులు గల్గ
జేయు శ్రీపతి నాపతి - చేరె నన్ను. 6

తులసిమాలాన్వితుండు ను - జ్వలకిరీట
ధారి శుభలక్షణయుతసౌం - దర్యమూర్తి,
క్షీరవారిధి శయనంబు - చేయుటయును,
వృషభముల నిశార్థము సంహ - రించుటయును
సాలవృక్షంబు లేదును - గూలునట్లు
చేయుటయును న స్మోప్సింప - జేయుకొరకె. 7

పరమసౌలభ్య మతనిస్వ - భావ మగుట,
వర్ణనాతీత మైన సం - పదల గల్గి
యతిశయంబులకెల్ల న - త్యధికు డైన
తులసిమాలలస్వామి, నా - దోషములను

శొల్లి రెన్నమ్మానై
యెన్నావియావితనై,
ఎల్లైయిల్ శీ
రెన్కరుమాణిక్కచ్చుడరై,
నల్లవముదమ్
పెఱఱ్కరియ వీడుమాయ్,
అల్లిమలర్విరై యొ
త్తాణల్ల న్పెణ్ణల్ల నే.

ఆణల్ల న్పెణ్ణల్ల నల్లావలియుమల్లన్
కాణలుమాగా నుళనల్ల నిల్లైయల్లన్,
పేణుఙ్గాల్పేణు మురువాగు మల్లనుమామ్,
కోణై పెరిదుడై త్తెమ్మానై క్కూఱుదలే. ౧౦

కూఱుదలొన్ఱారా క్కుడక్కూత్త వమ్మానై,
కూఱుదలేమేవి క్కురుకూర్ చ్చడగోపన్,
కూఱినవన్దాది యోరాయిర త్తుళిప్పత్తుమ్,
కూఱుదల్ వల్లా రుళ రేల్కూడువర్ వైకున్దమే. ౧౧

గణన చేయక నాతోడ - గలసియుండె,
నెంతసౌలభ్యమో మీర - లెరుగ గలరె. 8

వైష్ణవశ్రేష్ఠులార! నా - స్వామి యగుచు
నాత్మ కాత్మ యౌసకలక - ల్యాణగుణుని
నీలమాణిక్యకాంతుల - నెరపువాని
సత్కథామృతపానంబు - సలుపరయ్య!

* * *

సాటి లేనట్టి యమృతవ - ర్ష ప్రదాత,
మోక్షము నొసంగు దేవతా - మూర్తి, మిగుల
దుర్లభద్రవ్యనిధి యభ - క్తులకు జూడ,
విమలసరసిజపరిమళా - న్వితశరీరి,
పురుషజనములయందును - బాలతులందు
వాని బోలెడువార లె - వ్వరును లేరు. 9

తలప స్త్రీపున్నపుంసకే - తరుడతండు,
సర్వవస్తువిలక్షణ - సద్యశుండు,
బాహ్యపంచేంద్రియములకు - బట్టువడడు,
భక్తజనులకు సులభుండ - భక్తదుర్ల
భుండు; వివిధావతార స - త్పూరుషుండు. 10

వర్ణనాతీతము లగు శ్రీ - పతిగుణముల
నొక్కటేనియు వర్ణింప - నుర్విజనుల
కలవి గానట్టి కఠినకా - ర్యంబు గనుక
అట్టికల్యాణగుణుగూర్చి - యతివరుండు
తిరునగరిమాని వ్రాయు పా - శురములందు
నీపదింటిని భక్తితో - నెవరు పఠన
చేయుదురో వారు వైకుంఠ - సేవ గాంత్రు. 11

## ఇరణ్డామ్బత్తు

## ఆఱామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

వైకున్దామణివణ్ణనే యెన్బొల్లా
త్తిరుక్కుఱళా వెన్నుళ్ మన్ని,
వైగుమ్వైగల్ తోఱు
మముదాయ వానేఱే,
శెయ్‌గున్దావరున్దీమై యున్నడియార్క్కుత్తీర్త్తు
అశురర్క్కుత్తీమైగళ్
శెయ్‌గున్దా, వున్నైన్నాన్
పిడిత్తేన్గొళ్ శిక్కెనవే. ౧

శిక్కెనచ్చిఱిదోరిడము మ్బుఱప్పడా త్తన్నుళ్ళే, ఉలగుగళ్
ఒక్కవేవిఴుఙ్గిప్పుగున్దాన్, పుగున్దదఱ్పిన్
మిక్కఞాన వెళ్ళచ్చుడర్విళక్కాయ్
త్తుళక్కఱ్ఱముదమాయ్, ఎఙ్గుమ్
పక్కనోక్కఱియా నెన్ పైన్దామరై క్కణ్ణనే. ౨

తామరై క్కణ్ణనై విణ్ణోర్ పరవుమ్
తలైమగనై, త్తుఴాయ్ విరైప్

## ద్వితీయ శతకము

## షష్ఠ దశకము

(సంశ్లేషానందము)

పరమపదమున వసియించు - ప్రభువరేణ్య!
నీలమాణిక్యకాంతుల - నేలు ఘనుడ!
వామనత్వంబు వహియించి - భక్తతతికి
అందమెల్లను జూపని - సుందరుండ!
నడచుకాలంబు సర్వంబు - నన్ను జేరి
విడనియమృతమయుండవౌ - వేదవేద్య!
ఆశ్రితావనపరతంత్ర! యమరనాథ!
భక్తకోటుల పాపము - ల్బాపుదేవ!
దృఢముగా బట్టుకొంటిని - విడువనేర,
దేవ యంగీకరించితే - తీరవలయు. 1

ఒక్కయూరైన విడిపోవ - కుండ జేర్చి
యఖిలజగముల నొకటిగా - నారగించు
లోకనాయకు డిపుడు నా - లోన జేరె;

* * *

చేరి జ్యోతిస్స్వరూపుడై - చెలువమెసగ
బ్రక్క నుండు శ్రీభూమినీ - ళాసతులను
మరచి యున్నవా డానంద - మగ్నుడగుచు. 2

కమలనేత్రుండు నిత్యవ - ర్గములప్రభువు
అతులసౌరభతులసిమా - లాన్వితుండు

ఫూమరువుకణ్ణై
యెమ్బిరానై పొన్మలైయై,
నామరువనన్గేత్తి యుళ్ళివణఙ్గి
నామగిఴ్న్దాడ, నావలర్
పామరువినిఱ్కత్తన్ద
పాన్మైయేవళ్ళలే, 3

వళ్ళలే మదుశూదనా
వెన్మరదకమలైయే, ఉన్నైనినైన్
దెళ్గల్తన్ద వెన్దా
యున్నైయ్యెఙ్ఙనమ్విడుగేన్,
వెళ్ళమేపురైనిన్పుగఴ్ కుడై
న్దాడిప్పాడి క్కళిత్తుగన్దుగన్దు
ఉళ్ళనోయ్గళెల్లామ్
తురన్దుయ్న్దు పోన్దిరున్దే. ౪

ఉయ్న్దుపోన్దెన్నులప్పిలాద వెన్తీవినైగళై నాశఞ్జెయ్దు,ఉన
దన్దమిలడిమై యడైన్దేన్నెవ్వాడు వేనో,
ఐన్దుపైన్దలైయాడరవణై మేవి ప్పాఱ్కడల్ యోగనిత్తిరై,
శిన్దైశెయ్దవెన్దా యున్నైచ్చిన్దైశెయ్దు శెయ్దే. ౫

పసిడికొండను బోలునా - ప్రాణనాథు
డైన శ్రీనాథునిం జేరి - ధ్యానగాన
నాట్యము లొనర్చుశక్తి దా - నంతదానె
యిచ్చి పూజాదికముల జే - యించుకొనియె!

* * *

వాని యౌదార్యగుణము నె - ట్లంగి మరతు. 3

ఓ ధరానాధ! మరకతో - ర్వీధరంబ!
మధువునుం బరిమార్చిన - మానధనుడ!
ఇతరవిషయంబులను ద్యజి - యింప జేసి
నిన్నె వరియింప జేసిన - వన్నెకాడ!

* * *

జలనిధిం బోలు నీగుణ - సంపదలను
స్తోత్రగానంబు లొనరించు - సుఖమువలన
మానసవ్యాధులెల్లను - మాసిపోయె;
ప్రబల సంసారదుఃఖసం - బంధములను
వదలుకొంటిని; మిగుల ని - ర్భయుడనైతి;
ఇంక క్షీణమైన నిను వీడు - టెట్లు లోర్తు. 4

క్షీరజలనిధిలో శేషు - సెజ్జపైని
శయన మొనరించి, జగతి ర - క్షణ మొనర్చు
విధుల నాలోచనముచేయు - వేదవిదుడ!

* * *

నీపదాంబుజముల ధ్యాన - నిరతివలన
నన్ను బాధించుదుఃఖాగ్ని - నాశమయ్యె;
ఇంక నీపాదసేవ నే - నెట్లు విడుతు? 5

ఉన్నైచ్చిన్దై శెయ్దుశెయ్
దున్నెడుమామొழி యిశై పాడియాడి, ఎన్
మున్నైత్తీవినైగళ్
ముழுవేరరిన్దనన్ యాన్,
ఉన్నైచ్చిన్దైయినాలిగழన్ద
విరణియనగల్ మార్వఙ్కీణ్డ, ఎన్
మున్నైక్కోళరియే
ముడియాద దెన్నెనక్కే. ౬

ముడియాదదెన్నెనక్కేలిని
ముழுవేழులగుముణ్డాన్, ఉగన్దువన్దు
అడియేనుళ్ పుగున్దా
నగల్వానుమల్లనిని,
శెడియార్ నోయ్గళెల్లామ్ తుఱ
న్దెమర్ కీழ் మేలెழுపిఱప్పుమ్,
విడియావెన్నరగ
త్తెన్ఱుమ్ శేర్దల్ మాఱినరే. ౭

మాఱిమాఱిప్పలపిఱప్పుమ్పిఱ
న్దడియై యడైన్దుళ్ళన్దేఱి,
ఈఱిలిన్బత్తిరువెళ్ళమ్
యాన్మూழ்గినన్,
పాఱిప్పాఱియశురర్ తమ్
పల్కుழாఙ్గళ్ నీఱెழ, ప్పాయ్పఱవై యొన్ఱు

నిన్ను సర్వదా ధ్యానించి - నిన్ను దెలుపు
సత్కథామృతపానంబు - సలిపి నృత్య
గానముల, నాయనాదు లా - కర్మ ంధ
ముల సమస్తంబు దొలగించు - బలము గంటి.

* * *

పుణ్యజననాధు డైన హి - రణ్యకశిపు
జీల్చి సంహరించిన నార - సింహమూర్తి!
నిన్ను సేవించుభాగ్యంబు - గన్నయట్టి
నా కసాధ్య మెయ్యది భువ - నత్రయమున. 6
సప్తలోకము ల్పట్టి భో - జన మొనర్చు
దేవదేవుండు నన్ను ప్రీ - తిని వరించి,
నా మనస్సులో జేరి యా - నంద మొసగె;
నన్ను విడిపోవ డింక నె - న్నటికి గాని;

* * *

ముందువెనకల నేడేడు - పుట్టువులను
జన్మ మెత్తిన నా బంధు - జనులకెల్ల
క్రూరకర్మలవలన జే - కూరినట్టి
దుఃఖజాలంబు నీదయ - దొలగిపోయె;
ఇంక నా కసాధ్యం బైన - దేది గలదు. 7
లెక్క లేనిజన్మంబుల - బొక్కిపొక్కి
మనుజజన్మంబు గాంచి ని - ర్మలమనస్సు
నీకటాక్షంబుచే బొంది - నీపదాబ్జ
సమ్ముఖం బగు నానంద - సాగరమున
మునుగు చున్నాడ! నావంటి - భోక్త గలడె

* * *

ఏఱివీఱ్ఱిరున్దాయున్నై
యెన్నుళ్ నీక్కేలెన్దాయ్. ౮

ఎన్దాయ్ తణ్ తిరువేఙ్గడత్తుళ్ నిన్ఱాయ్
ఇలఙ్గై శెఱ్ఱాయ్, మరామరమ్
పైన్దాళేఴురువ
వొరువాళికోత్తవిల్లా,
కొన్దార్ తణ్ణన్దుఴాయినాయముదే
ఉన్నై యెన్నుళ్ళే కుఴైత్త, వెమ్
మైన్దా, వానేఱే
యినియెఙ్గుప్పోగిన్ఱదే. ౯

పోగిన్ఱ కాలఙ్గళ్ పోయకాలఙ్గళ్ పోగుకాలఙ్గళ్,
తాయ్ తన్దైయుయి
రాగిన్ఱా యున్నైనా నడైన్దేన్విడువేనో,
పాగిన్ఱతొల్ పుగఴ్ మూవులగుక్కుమ్ నాదనే పరమా,
తణ్వేఙ్గడ
మేగిన్ఱాయ్ తణ్డుఴాయ్ విరైనాఱుకణ్ణియనే. ౧౦

కణ్ణిత్తణ్ణన్దుఴాయ్ ముడి క్కమలత్తడమ్బెరుమ్
కణ్ణనై, ప్పుగఴ్నణ్ణిత్తెన్ కురుగూర్ చ్చడకోపన్ మాఱన్
శొన్న,
ఎణ్ణిఱ్చోర్విల్లన్దాది యాయిరత్తుళ్ళివైయుమోర్ పత్తిశై
యొడుమ్,
పణ్ణిఱ్పాడవల్లారవర్ కేశవన్తమరే. ౧౧

వివిధరాక్షససంతతి - నవిరళముగ
సంహరించుచు ధూళిధూ - సరిత మైన
పక్షిపతి నెక్కి నీపర - త్వంబుమహిమ
సర్వజగముల జాటించు - స్వామి! నీవు
నాహృదిని వీడబోకు మె - న్నటికి గాని. 8

వేంకటాద్రిని వెలసిన - వేదవేద్య!
లంక భస్మం బొనర్చిన - రామమూర్తి!
శరము నొక్కటి సంధించి - సాలవృక్ష
సప్తకంబును భంజించు - సాహసాంక!
తులసిమాలావిభూషణా! - దురితదూర!
నాదుహృత్స్థలి నివసించు - నవ్యరూప!
నిత్యసూరుల బాలించు - నిర్వికల్ప!
న న్విడిచి పోవనేర్తువే - నళిననేత్ర! 9

జరుగ నున్నట్టి జరిగిన - జరుగుచున్న
కాలములయందు ప్రాణంబు - వోలె దల్లి
వోలె దండ్రినిబోలె న - న్బ్రోచు దేవ!
సకలదిశలను దివ్యతే - జంబుతోడ
సర్వభువనంబులం బొల్చు - సార్వభౌమ!
భోగ్యవస్తువుగా నిన్ను - బొందియున్న
నేను విడువంగ నేర్తునే - నిమిష మైన. 10

పరమపురుషుని కల్యాణ - వైభవముల
ననుభవించుచు వానివ - ర్ణన మొనర్చు
వరమునీంద్రుడు సమ్మార్గు - వారు వ్రాయు
గ్రంథమం దీపదింటిని - గానయుక్త
ముగ భజించి పఠించెడు - పురుషులెల్ల
రాదినారాయణుని దయు - నంద గలరు. 11

## ఇరణ్డామ్పత్తు

## ఏఴామ్ తిరువాయ్ మొఴి



(మూలమ్)

కేశవన్తమర్ కీఴ్ మేలెమ
రేఴెఴుపిఱప్పుమ్,
మాశదిరిదు పెఱ్ఱు
నమ్ముడై వాఴ్వు వాయ్క్కిన్ఱవా,
ఈశన్ కరుమాణిక్క
మెన్ శెఙ్గోలక్కణ్ణన్ విణ్ణోర్
నాయకన్, ఎమ్బిరానెమ్మా
న్నారాయణనాలే. ౧

నారణన్ ముఴువేఴులగుక్కుమ్
నాదన్ వేదమయన్,
కారణమ్ కిరిశై కరుమ
మివై ముదల్వనెన్దై,
శీరణఙ్గమరర్ పిఱర్ పలరుమ్
తొఴుదేత్తనిన్ఱు,
వారణత్తై మరుప్పొశిత్తపిరా
నెన్ మాదవనే. ౨

## ద్వితీయ శతకము

## సప్తమ దశకము

(కృతజ్ఞత - ద్వాదశనామ సంకీర్తనము)

నిఖిలలోకాధినాథుని, నీలమణిని,
మేఘములడాలు మఱపించు - మేనివాని,
నిత్యసూరుల బాలించు - నీరజాక్షు,
దర్శనము చేయగల్గె నా - తనివి దీర !

*　　*　　*

స్వామి నారాయణుని కటా - క్షమున నాకు
ముందువెన్కల నేడేడు - పూరుషాంత
రములు శ్రీపతిభక్తిభా - గ్యము వడసిరి ;

*　　*　　*

నాసబంధుల కిట్టిదై - శ్వర్యలాభ
మునకు గారణ మాకేశ - వుని యనుగ్ర
హంబు గా కొక్కటేని య - న్యంబు గలదె !　1

ఆదినారాయణాఖ్యు డై - యఖిలలోక
ములకు స్వామి యై శ్రుతిశీర్ష - ములకు మూల
వస్తు వై యజ్ఞయాగాది - ప్రక్రియలకు
సాధనంబు స్వరూపంబు - సత్ఫలంబు
మూటికిని దానె మూల మై - ముక్తనిత్య
జీవకోటికి దాపస - శ్రేష్ఠులకును
ఆశ్రయం బగు శ్రీకృష్ణు - డబ్ధిసుతకు
భర్త భువనైకనాథుండె - స్వామి నాకు.　2

మాదవనెన్ఱ దేకొ
ణ్డెన్నై యిని యిప్పాల్పట్టదు,
యాదవఙ్గళుమ్ శేర్ కొడేన
ఱెన్ఱెన్నుళ్ పుగున్దిరున్దు,
తీదవమ్ కెడుక్కు మముదమ్
శెన్దామరై క్కణ్ కున్ఱమ్,
కోదవమి లెన్ కన్నల్కట్టి
యెమ్మానెన్ కోవిన్దనే. ౩

కోవిన్దన్ కుడక్కూత్తన్
కోవలనెన్ఱెన్ఱే కునిత్తు,
తేవుమ్తన్నైయుమ్ పాడి
యాడత్తిరుత్తి, యెన్నైక్కొణ్డెన్
పావన్దన్నైయుమ్ పాఱక్కై
త్తెమ రేఴెఴుపిఱప్పుమ్,
మేవుమ్తన్మైయమాక్కినాన్
వల్లనెమ్బిరాన్విట్టువే. ౪

విట్టిలఙ్గు శెఞ్జోదిత్తామరై
పాదమ్కైగళ్ కణ్గళ్,
విట్టిలఙ్గు కరుఞ్జుడర్
మలైయే తిరువుడమ్బు

నానిమిత్తంబు కృష్ణజ - న్మంబు నెత్తి,
మాధవా! యనునాకుయ్యి - మరచిపోక,
ఇంకమీాదట దోషంబు - లెవ్వి నాకు
గలుగ కుండగ మదిని సం - కల్ప మంది,
తెలిసి తెలియక చేసిన - తులువతనము
పాపములు నన్ను జేరని - పగిది, దానె
నాశరీరంబునం జేరు - నళిననేత్రు
డంబురుహకాంతి మెరయుదే - హంబువాడు,
పర్వతసమానవిగ్రహా - భాసురుండు,
బుద్ధిచేతను మరియు న - బుద్ధిచేత
గలుగుదోషంబు లెన్నడు - గననివాడు,
భోగ్యుడాయెను గలకండ - వోలె నాకు. 3

అతిసమర్థుండు సర్వత్ర - వ్యాపకుండు
స్వామి గోవిందనామగో - పాలకుండు
కుంభనృత్యం బొనర్చెడు - గొల్లవాడు

*　　　*　　　*

ప్రేమతో నిన్నిపేరుల - బిలుచునట్లు,
దనపరత్వసౌలభ్య సౌం - దర్యవిషయ
నృత్యగానాదు లొనరింప - నేర్పి నన్ను
గ్లిష్టదశనుండి గాచి యం - గీకరించి.
యేడుతరములనాబంధు - లెల్ల ముక్తి
బొందునట్టి స్వభావంబు - చెందజేసి. 4

దివ్యకాంతికిరీటంబు - దేజరిల్ల
హస్తసౌందర్యమహితహ - స్తాబ్జు డగుచు
అక్షిదీప్తులచే నీర - జాక్షు డగుచు
అంఘ్రిమాధుర్యమున బంక - జాంఘ్రు డగుచు

విట్టిలఙ్గు మదియమ్శీర్
శఙ్గుశక్కరమ్ పఱుది,
విట్టిలఙ్గు ముడియమ్మాన్
మదుశూదనన్ తనక్కే. ౫

మదుశూదననై యన్ఱి మఱ్ఱిలే
నెన్ఱెత్తాలుమ్ కనుమమిన్ఱి,
తుదిశూఴ్న్ద పాడల్గళ్ పాడియాడ
నిన్ఱూఴియూఴితోఱుమ్,
ఎదిర్శూఴల్ పుక్కెనైత్తోర్ పిఱప్పు
మెనక్కేయరుళ్గళ్ శెయ్య
విదిశూఴ్న్దదా లెనక్కేలమ్మాన్
తిరివిక్కిరమనైయే. ౬

తిరివిక్కిరమన్ శెన్దామరైక్క
ణెమ్మాన్ ఎన్ శెఙ్గనివాయ్,
ఉరువిల్పొలిన్ద వెళ్ళైప్పళిఙ్గు
నిఱత్తననెన్ఱెన్ఱు, ఉళ్ళిప్

అంబుదచ్ఛాయ గలభూధ - రంబు బోలు
రమ్యగాంభీర్యయుత శరీ - రంబుతోడ
పాంచజన్యంబు చంద్రుని - పగిది దోప
జక్ర మలచండభానుని - సాటి గాగ
జేరి విష్ణుమూర్తియె నా శ - రీరమందు
హృదయపీఠాసన మలంక - రించి యుండె. 5

అట్టి మధుసూదనుకు దక్క - నన్య మైన
యాశ్రయం బొండు నామది - యందు లేదు ;
ఆత డొక్కండె నాకు దో - డని దలంతు ;
ఆత డొక్కండె నాకు ది - క్కని దలంతు ;
ఇతరపురుషార్థములచేత - నే ప్రయోజ
నంబు లే దని నానిశ్చ - యంబు చెలగు ;

* * *

జన్మజన్మంబునను దాను - జన్మ మెత్తి
హృదయపీఠంబున న్వసి - యించి యుండి
వానిస్తోత్రరూపంబు లౌ - పాశురముల
బావనములుగ నానోట - బల్క జేసి
పలుతెరంగుల నన్ను గా - పాడునట్టి
శ్రీసతీపతికృప యావ - రించి యుండ
బ్రాప్యు డాతండె నా కని - పల్క నేల? 6

విశ్వముల గప్పి కొలుచు త్రి - విక్రముండు
పుండరీకాక్షు డగుచు నా - పొంత జేరి
వశ్యుగా జేసికొనియె నా - వశమె యింక ;

* * *

పరవిప్పణిన్దు పల్లూఴియూఴి
నిన్ పాద పఙ్గయమే,
మరువిత్తొఴు మ్మనమేతన్దాయ్
వల్లైకాణ్ వామననే. ౭

వామన నెన్ మరదకవణ్ణన్
తామరైక్కణ్ణినన్,
కామనైప్పయన్దాయ్, ఎన్ఱె
న్ఱు కఴల్ పాడియేపణిన్దు,
తూమన త్తననాయ్
ప్పిఱవిత్తుఴదినీఙ్గ. ఎన్నై
త్తీమనఙ్గెడుత్తా యునక్కెన్
శెయ్గే నెన్ శిరీదరనే. ౮

శిరీదరన్ శెయ్యత్తామరై క్కణ్ణ
నెన్ఱెన్ఱిరాప్పగల్ వాయ్
వెరీఇ, అలమన్దుకణ్కళ్ నీర్మల్గి
వెవ్వుయిర్త్తుయిర్త్తు,

అతిమనోహరమాధుర్య – మతిశయించు
రమ్యబింబాధరము దేనె – రంగు లీన
స్ఫటికధావళ్యమున దంత – పంక్తి మెరయ
సుందరాంగుండు నామది – చూరగొనియె ;

* * *

గానమున ధ్యానమున నమ – స్కారములను
యుగయుగంబున దనపాద – యుగము కందె
యమరజేసెను నా కాశ్ర – యం బొసంగి ;

* * *

నామనంబును బాలించు – నాథు డైన
యామహాదేవు సామర్థ్య – మే మనందు. 7
అదితికశ్యపులకు గుజ్జ – వై జనించి
బలికి గర్వం బడంచిన – బ్రహ్మచారి !
మరకతంబులకాంతిని – మరుగుచేయ
జాలునెమ్మేను గలిగిన – సారసాక్ష !
పరమశివు నైన చిటికెలో – భంగపరచు
కమ్మవిలుకాని గారాబు – కన్నతండ్రి !

* * *

అనుచు గానప్రణామంబు – లాచరింప
దగినరీతిని మనము ను – ద్ధరణచేసి
నాకు సంసారదుఃఖబం – ధముల బాపు
వామనా ! నీకు నే నేమి – బదులు సేతు. 8
నామనోహర ! శ్రీధరా ! – నళిననేత్ర !
యనుచు రేయింబవల్జపం – బాచరించి
నేత్రములనలుప్రక్కల – నీరు కార
వేడినిట్టూర్పు లెప్పుడు – విడుచుచుండు

మరీఇయతీవినైపూాళ
విన్బమ్వళర వైగల్ వైగల్
ఇరీఇ, ఉన్నై యెన్నుళ్ళై వైత్తనై
యన్నిరుడీకేశనే. ౯

ఇరుడీకేశ నెమ్బిరా
నిలఙ్గై యరక్కర్ కులమ్,
మురుడుతీర్త్తపిరానెమ్మాన్
నమరర్ పెమ్మానెన్నెన్ఱు,
తెరుడియాగిల్ నెఞ్జే వణఙ్గు
తిణ్ణమఱియఱిన్దు,
మరుడియేలుమ్ విడేల్ కణ్డాయ్
నమ్బిపఱ్పనాబనైయే. ౧౦

పఱ్పనాబ నుయర్వఱ
వుయరుమ్పెరున్దిఱలోన్.
ఎఱ్పర నెన్నైయాక్కిక్కొణ్
డెనక్కేతన్నైత్తన్ద
కఱ్పగమ్, ఎన్నముదమ్
కార్ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్
వెఱ్పన్. విశుమ్బోర్పిరా
నెన్దైతామోదరనే. ౧౧

తామోదరనై త్తనిముదల్వనై
ఞాలముణ్డవనై,
ఆమోతరమఱియ
వొరువర్క్కెన్ఱే తొఴుమవర్గళ్,

నాకు సంసారదుఃఖబం - ధముల బాపి
సర్వసుఖముల నొసగి సా - క్షాత్కరించి
నాశరీరంబులో జేరి - నన్ను బ్రోచు
పరమపూరుష! నీ కేమి - బదు లొసర్తు. 9

మానసము! నీకు జ్ఞాన మే - మాత్ర మైన
నున్నచో హృషీకేశు మ - హోపకారు
రావణాంతకు శ్రీరవా - రాశినిలయు
నిత్యసూరులు ధ్యానించు - నిర్వికారు
స్మరణ చేయుచు వాని యా - శ్రయము గనుము
దృఢముగా వాసి తత్త్వంబు - దెలిసికొనుము!

* * *

తెలిసికొనె దేని నీభ్రమ - దేలిపోవు;
వదలబోకు హృషీకేశు - పాదయుగము. 10

పద్మనాభుండు సర్వసం - పత్కరుండు
ప్రేమపూరితు డైన నా - ప్రియతముండు,
నన్ను లోజేసికొని దానె - నాకు బరమ
భోగ్య మైయున్న శ్రీకల్ప - భూరుహుండు,
అమృతతుల్య మహామాధుర్య - మలరువాడు,
మేఘకాంతుల విలసిల్లు - మేనివాడు,
వేంకటాద్రిని వసియించి - వెలయువాడు
పరమపద నిత్యసూరుల - పాలకుండు
అట్టిదామోదరుడు స్వామి - యయ్యె నాకు. 11

"ఏకకారణ మై భూమి - నెల్ల నొక్క
మారు మ్రింగు దామోదరు - మహిమ నెఱుగ
జాలువా డెవ్వ డుండు నే - జగతి నేని;"

* * *

తామోదరనురువాగియ
శివర్కుమ్ తిశైముగర్కుమ్,
ఆమోతరమఱియవమ్మానై
యెన్నాఴ్వణ్ణనైయే. ౧౨

వణ్ణమామణిచ్చోదియై యమరర్ తలైమగనై,
కణ్ణనై నెడుమాలై త్తెన్ గురుగూర్ చ్చడకోపన్,
పణ్ణియతమిఴ్మాలై యాయిరత్తు ళ్ళివై పన్నిరణ్డుమ్
పణ్ణిల్పన్నిరునామప్పాట్టణ్ణల్ తాళణైవిక్కుమే. ౧౩

## ఇరణ్డామ్ పత్తు

## ఎట్టామ్ తిరువాయ్మొఴి

(మూలమ్)

అణైవదరణైమే
ల్పూమ్పావైయాగమ్
పుణర్వదు, ఇరువరవర్
ముదలుమ్ తానే,
ఇణైవనామెప్పొరుళ్కుమ్
వీడుముదలామ్,

యనుచు నెల్లప్పు డతనినే - యాశ్రయించి
వాని కాయంబు లగుకుద్ర - వనజభవుల
తోడ నాకును బరమసం - తోష మొప్ప
దర్శనం బిచ్చు నారమా - ధవునిమహిమ
పొగడ దర మానె యెంతటి - పురుషుకైన. 12

పరమపదనాథుసుగుణౌఘం - పడ లెరింగి
స్త్రీలు బాలురు భక్తి జిం - తించునట్లు
వరమునీంద్రుండు నమ్మాళ్వు - వారు వ్రాయు
ద్వాదశాఖ్యలస్తోత్రంబు - సాదరమున
బఠన మొనరింప శ్రీపతి - పాదపద్మ
సేవ చేసెడు భాగ్యంబు - చెందగలరు. 13



## ద్వితీయ శతకము

## అష్టమ దశకము



(సర్వేశ్వరుని హేతుప్రపదత్వము)

శ్రీమహాలక్ష్మి ప్రక్కన - జేరి యుండ
శేషశయనంబునందు సం - శ్లేషసుఖము
ననుభవించెడు నాదినా - రాయణుండు ;

*　　*　　*

బ్రహ్మదేవుని గని సృష్టిభార - మిచ్చి,
రుద్రమూర్తిని గని లయ - ముద్ర నొసగి,

పుణై వ఩్ పిఱవిక్కడల్
నీన్దువార్ క్కే. ౧

నీన్దుమ్ తుయర్ పిఱవి యుట్పడ
మఱ్ఱెవ్వెవైయుమ్,
నీన్దుమ్ తుయరిల్లా
వీడుముదలామ్,
పూన్దణ్ పునల్ పొయ్గై
యానై యిడర్ కడిన్ద,
పూన్దణ్డుఴాయె఩్
తనినాయగ఩్ పుణర్ప్పే. ౨

పుణర్క్కుమయ఩ా
మఴిక్కుమర఩ామ్,
పుణర్త్తత఩్నున్దియో
డాగత్తుమన్ని,
పుణర్త్తతిరువాగి
త్త఩్ మార్విల్ తా఩్ శేర్,

రక్షకత్వంబు కోరలు నే - ర్పరలు గామి
స్వయముగా నిర్వహించెడు - ప్రభువరుండు.

*　　　*　　　*

సర్వవస్తుసజాతీయు - సంభవుండు

*　　　*　　　*

మృత్యు సంసారజలధిచే - మ్రింగబడెడు
జీరసమూహంబు కెల్ల మో - క్షప్రదాత. 1
సిరికి జెప్పక చక్రంబు - చేత గొనక
గరుడు నెక్కక యరిమురి - బరుగులెత్తి;
పుష్పజాతివికాసప్ర - పూరితంబు
నిర్మలసమృద్ధజలరాశి - నిర్మితంబు
నగుసరస్సున నాగేంద్రు - నార్తి దీర్చి
మకరి దండించు నా స్వామి - మాధవుండు,
సురభితులసీదళాన్విత - సుందరుండు,
నన్ను బాయని యేకైక - నాయకుండు;

*　　　*　　　*

అట్టి జగదేకసుందరు - నాశ్రయించి
వానిదయచేత సంసార - వార్ధి దాటి
జన్మముల బాసి మీరు మో - క్షమును గనుడు! 2
తాను బుట్టినకమలంబు - తోన మేని
లోన వసియించి యీసర్వ - లోకములకు
సృష్టి నిర్వహించెడు సుర - జ్యేష్ఠునకును,
లోకసంహార మొనరించు - రుద్రునకును,
అంతరాత్మ నై, వక్షస్థ - లాంతరమున
శ్రీమహాలక్ష్మి నివసించి - చెలువు గొలుప,

పుణర్ప్పన్ పెరుమ్పుణర్
    పెఙ్గుమ్పులనే. 3

పులనైన్దుమేయుమ్
    పొఱియైన్దునీఙ్గి,
నలమన్దమిల్లదోర్
    నాడుపుగువీర్,
అలమన్దువీయ
    వశురరైచ్చె   న్,
పలమున్దుశీరిల్
    పడిమినోవాదే. ౪

ఓవాత్తుయర్ పిఱవి యుట్పడమఱ్ఱెవ్వైయుమ్,
మూవాత్తనిముతలాయ్ మూవులగుమ్కావలోన్,
మావాగి యామైయాయ్ మీనాగి మానిడమామ్,
తేవాది తేవపెరుమా నెన్ తీర్త్తనే. ౫

తీర్త్తనులగళన్ద
    శేవడిమేల్ పూన్దామమ్,
శేర్త్తియవైయే
    శివన్ముడిమేల్ తాన్కణ్డు,

ఎవ్వ రేకాలమున జేయ - నెఱుగనట్టి
తన యమానుష కార్యసం ధానసముద
యంబు జగతికి సుప్రసి ద్ధంబు - గాదె! 3

పంచతన్మాత్రలనుబట్టి - ప్రాకులాడు
నింద్రియంబుల పోకడ - లెల్ల నడచి
యంత మెఱుగనియానంద - మనుభవింప
నద్వితీయ మా పరమప - దాంతరమున
జేర గోరెడుచేతన - శ్రేష్ఠులార!

* * *

దుష్టరాక్షససంహారు - దురితదూరు
సుగుణచింతనానందంబు - చూరగొనుడు;
ఆ మహాభాగ్యభోగంబు - నందు స్వగత
భేదములు గల్గ వయ్యది - ప్రేమమయము. 4

జన్మ సంసార దుఃఖ సం - సర్గమునకు
గారణుండును స్థితికర్త - మారకుండు
లోకములకెల్ల రక్షక - రూపవర్తి
బ్రహ్మరుద్రాద్యమరులకు - స్వామి, నాకు
బంధమోక్షం బొనర్చిన - పావనుండు
మత్స్య కూర్మ హయగ్రీవ - మానుషాది
జన్మముల నొంది భువనర - క్షణ మొనర్చు. 5

పాండవులకును గౌరవ - ప్రభువునకును
జరుగుసనిలోన నొకనాడు - సవ్యసాచి
పాశుపతము పునస్మృతి - బడయ దలచి
పుండరీకాక్షుపదపద్మ - పూజ సలిపి

పార్ త్తన్ తెళిన్దొఴిన్ద
　　పైన్దుఴాయాన్ పెరుమై,
పేర్ త్తుమొరువరాల్
　　పేశక్కిడన్దదే. ౬

కిడన్దిరున్దు నిన్ఱళన్దు
　　కేఴలాయ్ క్కీఴ్పుక్
కిడన్దిడుమ్, తన్నుళ్
　　కరక్కుమ్ ముమిఴుమ్,
తడమ్ పెరున్దోళార
　　త్తఴువుమ్ పారెన్నుమ్
మడన్దైయై, మాల్ శెయ్గిన్ఱ
　　మాలార్ కాణ్బారే. ౭

కాణ్బారారెమ్మీశనై
　　కణ్ణనై యెన్ కాణుమాఱు,
ఊణ్ పేశిలెల్లా
　　పులగుమోర్ తుఴఴ,
శేణ్బాలవీడో వుయిరో
　　మఱ్ఱెప్పొరుట్కుమ్,
ఏణ్ బాలుమ్ శోరా
　　పరన్దుళనామెఙ్గుమే. ౮

నిద్రలో స్వప్నమున గాల - రుద్రుకడకు
బోయి యా పుష్పముల రుద్రు - మూర్ధమందు
గనుట కృష్ణపరత్వంబు - గాంచ గలిగె ;

* * *

కనుక శ్రీకృష్ణుమహిమ ని - ష్కర్షచేయ
వేరు సాక్ష్యంబు నెవరేని - గోరనేల ? 6

పాలకడలి నతిప్రేమ - బండుకొనుట
వేంకటాచలమున నిల్చి - వేడ్క నుంట
చేరి శ్రీరంగమందు వ - సించుచుంట
కూర్మమై నెత్తిపై మోసి - కొని తిరుగుట
యండభిత్తిలో నడుగంటి - యడగి యున్న
వేళ నాదివరాహమై - వెలిపరచుట
ప్రళయమొనరించి కాపాడి - బయట నిడుట
ప్రేమ నాలింగన మొనర్చి - ప్రీతి గనుట
ఇన్ని వ్యామోహముల జూపి - యేలుకొనిమె
దనకు క్షేమంపుటర్ధాంగి - ధరణి గనుక.
అతనిలీలల నెరుగంగ - నలవియగునె 7

స్వామి శ్రీ కృష్ణు నెరుగంగ - శక్తులెవరు
ఎరుగవలె నన్న దద్విధం - బెట్టు లగునో !
భోజనము చూడ బోయిన - భువనసప్త
కంబు చాలదు తన కొక్క - కబళమునకు ;
వానివాసస్థలం బన్న - బరమపదము ;
వ్యాప్తి గనుగొంటిమా సర్వ - వస్తునిత్య
బద్ధముక్తజీవులయందు - బర్వియుండు
అతని మహిమంబు నెరుగంగ - నగునె మనకు. 8

ఎఙ్గుముళన్ కణ్ణనెన్ఱ మగనైక్కాయ్న్దు,
ఇఙ్గిల్లైయాలెన్ఱిరణియన్ తూణ్ పుడైప్ప,
అఙ్గప్పొఴుదే యవన్ వీయత్తోన్ఱియ, ఎన్
శిఙ్గప్పిరాన్ పెరుమై యారాయుమ్శీర్మైత్తే. ౯

శీర్మైకొళ్ వీడు
    శువర్క్కనరగీఱా,
ఈర్మైకొళ్ తేవర్ నడువా
    మఱ్ఱెప్పొరుట్కుమ్,
వేర్ముదలాయ్ విత్తాయ్
    ప్పరన్దుతనినిన్ఱ,
కార్ముగిల్ పోల్వణ్ణ
    నెన్కణ్ణనై నాన్కణ్డేనే. ౧౦

కణ్ణలఙ్గళ్ శెయ్య కరుమేనియమ్మానై,
వణ్ణలమ్బుమ్శోలై వఴుదివళనాడన్,
పణ్ణలైయుళ్ప్పొన్నతమిఴాయిర త్తిప్పత్తుమ్వల్లార్,
విణ్ణలైయుల్ వీఱ్ఱిరు న్దాళ్వ రెమ్మావీడే. ౧౧

పరమపురుషుండు సర్వత్ర - పరగు ననుచు
బలుకుప్రహ్లాదు నెడల జే - రలుక పూని
యట్టు లగునేని యీ స్తంభ - మందు జూపు
మని హిరణ్యకశిపుడు ద - ట్టినక్షణంబె
సింహరూపంబు గొని వాని - జీల్చినట్టి
నారసింహుని మహిమ వి - చారణంబు
చేయవలెనొక్కొ! లోకప్ర - సిద్ధముగద! 9

స్వర్గనరకాదు లగుపుర - షార్థముల నొ
సంగువాడు, సమస్తవ - స్త్వంగి యగుచు
నన్నిటికి దానె యాధార - మైనవాడు-
సర్వజగతి కుపాదాన - సహకరణ ని
మిత్త కారణంబులు గాగ - మెలగువాడు
సర్వవస్తువిలక్షణ - సత్తముండు
నీల మేఘుంబు మించిన - డాలువాడు
వాని దర్శనభాగ్యాను - భవము గంటి. 10

సుందరవిశాల చతురా - నందు డగుచు
వివిధవిగ్రహములయను - భవము లిచ్చు
దేవదేవుండు విలసిల్లు - దిరుసగరిని
వాస మొనరించు నమ్మాళు - వారు వ్రాయు
పాశురసహస్రమం దొక్క - పది యనంగ
పల్కు నివ్వాని నెవ్వరు - పఠనచేతు
రట్టివారికి గల్గు మో - క్షానుభవము. 11

## ఇరణ్డామ్ పత్తు

## ఒన్బదా న్తిరువాయ్ మొழி

(మూలమ్)

ఎమ్మావీట్టు త్తిఱముమ్ శెప్పమ్, నిన్
శెమ్మాపాదపఱ్ఱు త్తలై శేర్త్తు, ఒల్లై,
క్కైమ్మాతున్బమ్ కడిన్దపిరానే,
అమ్మావడియేన్ వేణ్డువదీదే. ౧

ఈదేయానునై క్కొళ్వదెన్ఱాన్ఱుమ్, ఎన్
మైదోయ్ శోది మణివణ్ణ వెన్దాయ్,
ఎయ్దానిన్గழల్ యానెయ్ద ఞానక్
కైదా కాల క్కழివుశెయ్యేలే. ౨

శెయ్యేల్ తీవినై యెన్ఱరుళ్ శెయ్యుమ్, ఎన్
కైయార్ శక్కర క్కణ్ణపిరానే,
ఐయార్ కణ్ణ మడైక్కిలుమ్, నిన్కழల్
ఎయ్యాదేత్త వరుళ్ శెయ్యనక్కే. ౩

ఎనక్కేయాట్చెయ్ యెక్కాలత్తుమెన్ఱు, ఎన్
మనక్కేవన్దిడై వీడిన్ఱిమన్ని,
త్తనక్కేయాగ వెనైక్కొళ్ళుమీదే.
ఎనక్కేకణ్ణనై యాన్కొళ్ శిఱప్పే. ౪

## ద్వితీయ శతకము

## నవమ దశకము

---

(పారతంత్రాభిలాష)

కరిపతిం దయ గాచిన - కమలనాభ!
నీపదముల నాశిరమున - మోపుదేని
పరమపదలాభ మైనను - వదలుకొందు
నీపదస్పర్శమే చాలు - నీరజాక్ష! 1

దివ్యనీలమణిం బోలు - దేహకాంతి
తోడ జెలువొందు - సుందరా! తోయజాక్ష!
శీఘ్రముగ నీపదంబుల - జేరునట్లు
భక్తి గలిగింపు మిదియ నా - ప్రార్థనంబు;
ఇంతకంటెను వేఱు నే - నెదియు గోర. 2

చక్రధరుడ వౌ నాప్రియ - సారసాక్ష!
పాపముల జేయ కుండ గా - పాడినావు
కృష్ణదేవుడ వగుచు వి - రించిప్రభృతి
దేవతల కష్టములనెల్ల - దీర్చినావు
అంత్యకాలంబునంగూడ - నడ్డు లేక
నీస్మరణ నాదు హృత్థ్సలి - నిల్పుమయ్య! 3

సర్వకాలము నీపదా - బ్జములసేవ
చేయునట్టు లొనర్చి నా - చిత్తమందు
వాస మొనరించి నీసొత్తు - చేసికొంటి;
ఇదియ నాస్వామి శ్రీకృష్ణు - నెల్లయప్పు
డుల్లమున నేను గోరు ప్ర - యోజనంబు. 4

శిఱప్పిల్వీడు శువర్క్కనరగమ్.
ఇఱప్పి లెయ్దుగవెయ్దఱ్క, యానుమ్
పిఱప్పిల్ పల్పిఱవి ప్పెరుమానై,
మఱప్పొన్ఱిన్ఱి యెన్ఱుమ్మగిఴ్వనే, ౫

మగిఴ్కొళ్ తెయ్వ
    ములోగమలోగమ్,
మగిఴ్గొళ్ శోది
    మలర్న్దవమ్మానే,
మగిఴ్కొళ్ శిన్దైశొ
    ఱ్చెయ్గై కొణ్డు, ఎన్ఱుమ్
మగిఴ్వుఱ్ఱున్నై
    వణఙ్గవారాయే. ౬

వారా యున్ఱిరుప్పాద మలర్క్కీఴ్,
పేరాదే యాన్వన్దడైయుమ్బడి
తారాయ్, ఉన్నై యెన్నుళ్ వైప్పిలెన్ఱుమ్
ఆరాయ్, ఎనక్కెన్ఱుమెక్కాలే. ౭

ఎక్కాలత్తెన్దైయా యెన్నుళ్ మన్నిల్, మఱ
ఱెక్కాలత్తిలుమ్ యాదొన్ఱుమ్ వేణ్డేన్,
మిక్కార్వేదవిమల ర్విఴుఙ్గుమ్, ఎన్
అక్కారక్కనియే యున్నై యానే. ౮

ఈశరీరంబు విడిచి నే - నేగినంత,
మోక్షమం దైన స్వర్గభూ - ములను నైన
నరకమం దైన వేఱుజ - న్మమున నైన,
పరమకారుణికస్వభా - వంబుతోడ
వివిధరూపంబులను భూమి - వెలయు చుండు
పరమపురుషుని మరవక - స్మరణచేయు
భాగ్యము నొసంగి నన్ను - గాపాడవలయు! 5

చేతనాచేతనాత్మక - భూతములకు
సూర్యచంద్రాదిదేవతా - స్తోమమునకు
సృష్టియు స్థితిలయములు - చేయుస్వామి
స్మరణమునకు సాధన మైన - మనముతోడ
బల్కుటకు సాధనం బగు - వాక్కుతోడ
ఆర్తితో సేవ చేయు దే - హంబుతోడ
ఎప్పు డానందమున నాశ్ర - యించి నిన్ను
మరవ కుండెడుమార్గంబు - గరపుమయ్య! 6

ఎంతకాలంబు నిన్ను నా - యెద దలంచి
కాంచు చున్నను సంతృప్తి - గలుగ దాయె;
కనుక నీదర్శనము సర్వ - కాలములను
గలుగజేయుచు నీపాద - కమలములకు
సేవ గావించునటులు న - న్గావవలయు! 7

ఉపనిషత్తులయం దుత్త - మోత్తములుగ
వర్ణన మొనర్పబడు నిత్య - వర్గమునకు
భోగ్యవస్తు వై చెలు వొందు - పురుషవర్య!
వేఱువర మొక్కటియు నేను - గోర కుందు

యానేయెన్నై యఱియకిలాదే,
యానేయెన్ఱనదే యెన్ఱిరున్దేన్,
యానేనీ యెన్నుడైమైయుమ్ నీయే,
వానేయేత్తు మెమ్వానవరేఱే. ౯

ఏఱేఱ్ఱుమ్
వెన్ఱేర్కొళిలఙ్గైయై,
నీఱేశెయ్ద
నెడుఞ్జుడరోచ్చది,
తేఱేలెన్నై
యున్పొన్నడి చ్చేర్త్తు, ఒన్ఱై
వేఱేపాగ
వెణ్ణాన్ఱుమ్విడలే. ౧౦

విడలిల్శక్కర త్తణ్ణలై మేవల్,
విడలిల్వణ్ కురుగూర్ చ్చడకోపన్ శొల్,
కెడలిలాయిరత్తు ళ్ళివై పత్తుమ్,
కెడలిల్వీడు శెయ్యుమ్ కిళర్వార్ క్కే. ౧౧

నిర్మలం బగు నాహృది - నిత్యవాస
మును నొనర్చుచు నందు గా - పుర మొనర్చు;
శర్కరంబోలు మకరంపు - స్వామి వగుచు. 8

పరమపదవాసు లందరు - పాడు చుండ
నిత్యసూరుల బాలించు - నీరజాక్ష!
నే స్వతంత్రుడ వీనికి - నేను సొంత
దారుడ నటన్నబుద్ధి వి - నాశ మందె;
నేను బరతంత్రుడ నటంచు - నిఖిలవస్తు
జాలమున నొక్కడవె నీవు - స్వామి వనుచు
దెలిసికొన్నాడ నిక నాకు - దిరుగు లేదు. 9

రామరూపంబునం బుట్టి - రాజ్య మేలి
కృష్ణజన్మంబునను భువి - గీర్తి బొంది
రక్షకత్వంబు చాటించు - రాజరాజ!
నాకు నీ విచ్చినట్టి జ్ఞా - నంబుచేత
సిద్ధి చేకూరు నంచను - బుద్ధి వలదు;
దుఃఖసంసారబంధము - త్రొలగ జేసి
వేరుచింతల నెల్లను - విడిచి నిత్య
సేవ నీ కొనరించెదు - చిత్త మిమ్ము! 10

చక్రధరు డైనస్వామి యా - శ్రయము గొనిన
పరమమునియగు నమ్మాళ్వు - వారు వ్రాయు
లక్షలం బోలు పాశుర - రాశియందు
నీపదింటిని బఠియించు - నెల్లజనులు
పొంద నేర్తురు సంసార - మోక్షపదవి. 11

ఇరణ్డామ్ పత్తు

పత్తామ్ తిరువాయ్ మొళ్ళి



(మూలమ్)

కిళరొళియిళమై కెడువదన్ మున్నమ్,
వళరొళిమాయో న్మరువియకోయిల్,
వళరిళ మ్పొళ్ళిల్ శూழ్ మాలిరుంజోలై,
తళర్విలరాగి చ్చార్వదుశదిరే. ౧

శదిరిళమడవార్ తాழ్చ్చియైమదియాదు,
అదిర్కురల్శఙ్గత్తழగర్ తంగోయిల్,
మదితవழ్కుడుమి మాలిరుంజోలై,
పదియదువేత్తి యెழువదుపయనే. ౨

పయనల్ల శెయ్దు పయనిల్లై నెంజే,
పుయల్మழైవణ్ణర్ పురిన్దురైకోయిల్,
పుయల్ మిగుపొழిల్శూழ్ మాలిరుంజోలై,
అయన్మలై యడైవ దదుకరుమమే. ౩

కరుమవన్ పాశ
ఙ్కழిత్తుழన్రుయ్యవే,

## ద్వితీయ శతకము

## దశమ దశకము

(తిరుమాలిరుంజోళాద్రి)

యౌవనము వృద్ధి చెందు వ - యస్సునందె
ముసలితన మంకురింపక - ముందె, భక్త
లార! మాలిరుంజోళాద్రి - యాత్రచేసి,
యచట శృంగారవనమధ్య - మందు నిరుప
మానకాంతుల విలసిల్లు - మాధవునకు
అంజలి యొనర్చి పొందుడీ! - యాశ్రయంబు. 1

లేతజవరాండ్ర మిసిమిసి - పూతలకును
వారిశృంగారములకును - వలపుగొనక,
పాంచజన్యంబు ధరియించు - పద్మనాభు
నళగ రనుసుందరాంగుని - కథని వేళ
మైనమాలిరుంజోళాద్రి - నాశ్రయించి
పొందుడీ! మీరు వేవేగ - మోక్షపదవి. 2

ఓ మనస్స! నిస్సారంపు - గామములను
నన్నిటి సమూలముగ వీడి - యళగరాఖ్యు
వాస మై పుష్పవనముల - బరిమళంబు
గూర్చుమాలిరుంజోళాద్రి - గోరి యాశ్ర
యించుటయె మీకు గర్తవ్య - మెప్పుడేని. 3

క్రూరకర్మబంధముల బో - గొట్టి జనుల
దరికి జేర్చు గోవర్ధనో - ద్ధారకుండు

పెరుమలై యెడుత్తాన్
పీమత్తై కోయిల్,
పరుమణాழ்తవழ்
మ్మాలిరుంజోలై,
తిరుమాలై యదువే
యడ్డై వదుతిఱమే. ౪

తిఱముడై వలత్తాల్ తీవినై పెరుక్కాదు,
అఱముయలాழி ప్పడై యవన్ కోయిల్,
మఱువిల్వం శునై శూழ் మాలిరుంజోలై,
పుఱమలై శార ప్పోవదుకిఱియే. ౫

కిఱి యెననినై మిన్ కీழ்మై శెయ్యాదే,
ఉఱియమర్ వెణ్ణై యుణ్డవన్ కోయిల్,
మఱియొడుపిణై శేర్ మాలిరుంజోలై,
నెఱిపడవదువే నినై వదునలమే. ౬

నలమెననినై మిన్ నరగழுన్దాదే,
నిలమునమిడన్దాన్ నీడుఱై కోయిల్,
మలమఱుమది శేర్ మాలిరుంజోలై,
వలముఱై యెయ్ది మరువుదల్ వలమే. ౭

దనమహిమ వెలువరించెడు - స్థాన మగుచు
మందమారుత సుమలతా - సుందరంబు
నూర్ధ్వగాంభీర్యదంబు మే - ఘోన్నతంబు
నైన మాలిరుంజోళంబు - నందు వెలసె
నచటి యళగరిసుందరు - నాశ్రయించి
భక్తజనులార! కోర్కుల - ఫలము గనుడు! 4
దోషభూయిష్ఠసంసార - దుఃఖములను
బలము గల మానసముచేత - దొలగ ద్రోసి,
ఆశ్రితావనపరతంత్రు - డైన చక్రి
వెలయుమాలిరుంజోళంబు - వెలిని జెలగు
పర్వతముపొంత కరుగుట - బాగు మీకు. 5
చలముతో నుట్టిలో వెన్న - సంగ్రహించి
గొల్లజవరాండ్రు మిక్కిలి - కోపగింప
బరుగులిడి వచ్చు శ్రీకృష్ణ - బాలకుండు
అళగరీరూపమును బూని - యవతరించు
మాలిరుంజోళపర్వత - మూర్ధమందు,
తుచ్ఛవిషయంబులం దెట్టి - యిచ్ఛ గానక
దృష్టి నిల్పుడు మీకు సి - ద్ధించు ముక్తి. 6
భక్తజనులార! సంసార - పరత విడిచి,
పుడమి నండభిత్తిని బడి - పోవకుండ
నెత్తి కాపాడినట్టి స - ర్వేశ్వరునకు,
ఇందుమండలౌన్నత్యంబు - చెంది వెలయు
వాస మగు మాలిరుంజోళ - పర్వతమున
కరిగి యత్యాదరావాస - మచట జరుప
సర్వపురుషార్థములు మీకు - సఫలము లగు. 7

వలఞ్జెయ్దువైగల్ వలమ్కఴియాదే,
వలంజెయ్యుమాయ మాయవన్కోయిల్,
వలంజెయ్యుమ్వానోర్ మాలిరుఞ్జోలై,
వలంజెయ్దునాళుమ్ మరువుదల్ వఴక్కే. ౮

వఴక్కెననినైమిన్ వల్వినై మూఴ్గాదు,
అఴక్కొడియట్టా నమర్ పెరుఙ్గోయిల్,
మఴక్కళిఱ్ఱినమ్ శేర్ మాలిరుఞ్జోలై,
తొఴక్కరుదువదే తుణివదుశూదే. ౯

శూదెన్రుకళవుమ్
శూదుమ్య్యాదే,
వేదమున్విరిత్తా
న్విరుమ్బియకోయిల్,
మాదుఴుమయిల్ శే
ర్మాలిరుఞ్జోలై,
పోదవిఴ్మలైయే
పుగువదుపొరుళే. ౧౦

పొరుళెన్రివ్వులగ
మ్పడైత్తవన్ పుగఴ్మేల్,
మరుళిల్ వణ్కురుగూ
ర్వణ్ శడకోపన్,
తెరుళ్కొళ్ళచ్చొన్న
వోరాయిరత్తుళిప్పత్తు,
అరుళుడైయవన్ తా
ళడైవిక్కుమ్ముడిత్తే. ౧౧

బలము సంసారబంధనం - బంధములను
బాదు చేయక, దివ్యగో - పాలకుండు
వాస మొనరించు గోపురా - వాస మైన
మాలిరుంజోళపర్వత - మహిమ నెరిగి,
యనుదినంబు ప్రదక్షిణం - బాచరింతు
రేని యళగరి మీకు మో - క్షేచ్ఛ నొసగు. 8

క్రూరపాపభయంబుల - బారి బడక,
పూతనాంతకుమునికిచే - బూజ్య మగుచు
గజకిశోరబృందంబుల - గ్రాలు చుండు
మాలిరుంజోళమున భక్తి - మనమునందు
జేర్చుకొని పురుషార్థంబు - చేకొనుండు! 9

ద్రవ్యసంపాదనమునకు - దారు లనుచు
ద్యూతచౌర్యంబులను నేర్చి - దూరువడక
వేదములకు మూలంబు (శ్రీ) - విష్ణుదేవు
డధివసించినపూజ్యగృ - హం బనంగ
స్త్రీపురుషమయూరంబులు - చేరి తిరుగ
సుందరము లగుతరుల నా - నంద మొసగు
మాలిరుంజోళపర్వత - మార్గమునకు
బయలుదేరుడు మీభాగ్య - ఫలము పండ. 10

అవని సంసారులకు నవ - యవము లిచ్చి
భక్తి వా రొనరించు సే - వలను బొంది
మోక్షసంపద వారిచే - బొందజేయ
జగతి సృష్టియొనర్చిన - సార్వభౌము
విషయముల దెల్పు శఠకోప - విరచిత మగు
గ్రంథమందలి పదిపాశు - రంబు లైన
వీనిని బఠించుపురుషు ల - వ్వానిపాద
పంకజములను జేరుసౌ - భాగ్యపరులు. 11

# తిరువాయ్మొఴి

మూన్ఱామ్పత్తు

## ముదల్ తిరువాయ్మొఴి



(మూలమ్)

ముడిచ్చోదియా యునదు ముగచ్చోది మలర్న్దదువో
అడిచ్చోది నీనిన్ఱ తామరైయా యలర్న్దదువో,
పడిచ్చోది యాడైయొడుమ్ పల్కలనాయ్ నిన్పైమ్బొన్
కడిచ్చోది కలన్దదువో తిరుమాలే కట్టురైయే. ౧

కట్టురైక్కిల్ తామరై
నిన్కణ్ పాదమ్ కై యొవ్వా,
శుట్టురైత్త నన్పొ
న్నున్తిరుమేని యొళియొవ్వాదు,
ఒట్టురైత్తివ్వులగున్నై
ప్పుగఴ్వెల్లామ్ పెరుమ్బాలుమ్,
పట్టురైయాయ్ ప్పుఱ్కెన్ఱే
కాట్టుమాల్ పరఞ్జోదీ. ౨

# శ్రీ ముఖ సూక్తి

## తృతీయ శతకము

### ప్రథమ దశకము

(దర్శనానందము)

దివ్యవదనంబునందలి – తేజ మలరి
నీకు మణికిరీటంబుగా – నిలిచెనొక్కొ!
పాదసరసీరుహంబుల – ప్రభలు గూడి
పద్మపీఠంబుగా నీకు – బరగెనొక్కొ!
మేనికాంతులయొక్క స – మ్మేళనంబు
ఆభరణములు గాగ బీ – తాంబరముగ
దేజరిల్లెనో యనగ సం – దేహ మాయె. 1

అక్షులకు బాదములకు శ్రీ – హస్తములకు
బద్మ ముపమాన మని కవు – ల్పల్కు చుంద్రు;
దివ్యవిగ్రహకాంతికి – దీటు గాగ
పుటము పెట్టినకనకంబు – బోల్చు చుంద్రు;

*          *          *

అంబుజము లేడ! నీయవ – యవము లేడ!
కనక మది యేడ! నీమేని – కాంతు లేడ!
దలచినట్టులు చేయు స్తో – త్రము లెగాని
దోషయుతములు సరియె ని – ర్దోషములకు. 2

పర఩్జోదినీపరమాయ్ నిన్నిగఴ్న్దుపి఩్, మఱ్ఱోర్
పర఩్జోదియిన్మైయిఱ్పడియోవి నిగఴ్గిన్ఱ,
పర఩్జోదినిన్నుళ్ళే పడరులగమ్పడైత్త, ఎమ్
పర఩్జోదిగోవిన్దా పణ్బురైక్కమాట్టేనే. ౩

మాట్టాదేయాగిలు
ఇమ్మలర్ తలైమాఞాలమ్, నిన్
మట్టాయమలర్ పురైయుమ్
తిరువురువమ్మనమ్వైక్క,
మాట్టాదపలశమయ
మదికొడుత్తాయ్ మలర్త్తుఴాయ్,
మాట్టేనీమనమ్వైత్తాయ్
మాఞాలమ్వరున్దాదే. ౪

వరున్దాదవరుమ్తవత్త
మలర్ కదిర఩్ శుడరుడమ్బాయ్,
వరున్దాదఞానమాయ్
వరమ్బిన్ఱి ముఴుదియన్ఱాయ్,
వరుఙ్గాలమ్ నిగఴ్కాలమ్
కఴికాలమాయ్, ఉలగై
ఒరుఙ్గాగవళిప్పాయ్ శీ
రెఙ్గులక్క వోదువనే. ౫

ఓ పరాత్పర భాసుర - రూప ! నీవు
నిరుపమానుండ ! వగుట వ - ర్ణింపరాదు ;
కలుగ జేసెదు జగతి సం - కల్పమున నె ;
సేవ నొసగినాడవు నాకు - జిద్విలాస
మొప్ప, నీలీల నాబోంట్లు - చెప్ప గలరె ? 3

కంటి వీలోకముల నాభి - కమలమందు ;
పిన్న పెద్దలు నీదివ్య - విగ్రహమును
బెన్నధిగ శుభంబుల విజృం - భించుదాని
పుష్పసుకుమారమును, మనం - బుల గ్రహింప
జాల కల్లాడు చుండెడు - సమయమందు,
వారిజ్ఞానంబు మతపరం - పరలవలన
శూన్యతను బొంద గన్నార - జూచె దేల !

* * *

తులసితో నీవు సుఖముల - దూగుచున్న
బుడమి బామరజను లెట్లు - పోవవలయు? 4

శ్రమము లేకయె దివ్యతే - జస్సువలన
మెరుపుకాంతుల విలసిల్లు - మేనుగలిగి,
జ్ఞానమయరూపముం దాల్చి - స్వామి వగుచు,
అవధి లేకుండ సర్వప - దార్థజాల
మందు సర్వభాగంబుల - వ్యాప్తి చెంది,
మూడుకాలంబులందును - భువనకోటి
పాలనము రక్షణము చేయు - ప్రభుడ వైన
నీగుణంబుల వర్ణింప - నేర్తునొక్కొ ! 5

ఓదువారో త్తెల్లా
మెవ్వులగత్తెవ్వవైయుమ్,
శాదువాయ్ నిన్ పుగఴి
న్దగైయల్లాల్ పిఱిదిల్లై,
పోదువాఴ్ పునన్దుఴాయ్
ముడియనాయ్, పూవిన్మేల్
మాదువాఴ్ మార్పినా
యెన్ శొల్లియాన్వాఴ్త్తువనే. ౬

వాఴ్త్తువార్ పలరాగ
నిన్నుళ్ళే నాన్ముగనై,
మూఴ్త్తనీరులగెల్లా
మ్పడై యెన్ఱు ముదల్ పడైత్తాయ్,
కేఴ్త్తశీ రరన్ముదలా
క్కిళర్ దెయ్వమాయ్క్కిళర్న్దు,
శూఴ్త్తమరర్ దుదిత్తా
లున్ తొల్ పుగఴ్ మాశూణాదే. ౭

మాశూణా చ్చుడరుడమ్బాయ్
మలరాదు కువియాదు,
మాశూణా ఞానమాయ్
ముఴుదుమాయ్ ముఴుదియన్ఱాయ్,

వివిధలోకనివాసు దా - వేదవిదులు
నేర్చ యధ్యయనము చేయు - నిగమసమితి
నీయనంతగుణముల వ - ర్ణింప నెంచి
క్రమముగా నొనరించుచు - త్నములు గావె!

*  *  *

అమృతబిందువులం జల్లు - నట్టితులసి
మాలచే గిరీటముకాంతి - లీల దనర
బంకజోద్భవ యైన శ్రీ - పంకజాక్షి
వక్షము నలంకరించెడు - పరమపురుష!
నిన్ను నే నెట్లు స్తుతియింప - నేర్తునొక్కొ! 6

యెందరో యుంద్రు నిన్ను స్తుతి - యించువారు;
జలధివలయితత్రిభువన - చక్రమెల్ల
సృష్టి యొనరింప నలువను - జేసినావు;
జ్ఞానవృద్ధునిగా రుద్రు - సల్పినావు;
సురల బీయూషమున బాగు - పరచినావు;

*  *  *

అందఱుం జేరి నీదు క - ల్యాణగుణస
మూహవర్ణన మొనరింప - బూని రేని,
యొక్క భాగమేనియును బా - గుండునట్లు
పల్క గల్గుదురే! యది - వారితరమె? 7

బహుళజాజ్వల్యమాన మా - ప్రభలతోడ
దివ్యతేజంబు వెలిగెడు - దేహ మొప్ప,
అంతకంటెను హెచ్చు లే - నట్టి దగుచు
నక్షయం బైనజ్ఞానంబు - నధివసించి,

మాశూణావాఙ్కోల
త్తమరర్కోన్ వఴిప్పట్టాల్,
మాశూణావునపాద
మలర్చ్చోది మఴుంగాదే. ౧

మఴుంగాదవైనుదియ
శక్కరనల్వలత్తైయాయ్,
తొఴుఙ్గాద ఱ్కళిఱళిప్పాఙ్
పుళ్ళూర్న్దు తోన్ఱినైయే.
మఴుంగాదఞానమే
పడైయాగ మలరులగిల్,
తొఴుమ్బాయార్క్కళిత్తా
లున్శుడర్చ్చోదిమఱైయాదే. ౨

మఱైయాయ నాల్వేదత్తుళ్ నిన్ఱ
మలర్చ్చుడరే,
ముఱైయాలివ్వులగెల్లా
మ్పడైత్తిడన్దుణ్డుమిఴ్న్దళన్దాయ్,
పిఱైయేఱుశడైయానుమ్
నాన్ముగనుమిన్దిరనుమ్,

సృష్టియెల్ల శరీర మై - చెలగు చుండ,

*　　*　　*

ప్రణుతి కెక్కిన పాలక - త్వము వహించి,
జ్ఞానభూషణు డై యున్న - స్వామియొక్క
పాదకమలమహత్త్వంబు - పల్కబోవ,
బ్రహ్మదేవున కైన వి - భ్రమము గల్గు;
ప్రజ్వలిత మగు సద్వస్తు - వర్ణనంబు
మాటలం బల్క బూనిన - మాసి పోదె;　　8

కడుపులో నున్న సప్తలో - కములయందు
శరణు సొచ్చు భక్తులకెల్ల - జ్ఞాన మొసగి
మరపు లేకుండ సంకల్ప - మాత్రముననె
బొజ్జ గదలక వారిని - బ్రోచునట్టి
సర్వశక్తుడ వీవు శ్రీ - సార్వభౌమ!
అట్టివాడవు గజరాజు - నాడుకొనగ
నార్తనాదంబు విని నంత - నదరిపడుచు
గరుడుపై నెక్కి చేత జ - క్రము ధరించి
పరుగు లిడి వచ్చు టేలయా! - స్వయముగానె,
మహితగుణ! యిట్లు నీకీర్తి - మాయ కున్నె?　　9

భువి నభక్తుల కిట్లని - పోల్ప నలవి
గాని నాల్గువేదములవా - క్యముల కెల్ల
పారమార్థిక మగు భోగ్య - వస్తు వీవ!
జగములను సృష్టి మొద లగు - సర్వవిధుల
బరపి పరిపాలన మొనర్చు - ప్రభుడ వీవ!

*　　*　　*

ఇత్తై యాదలఱిన్దేత్త
వీఱ్ఱిరుత్త లిదువియప్పే. ౧౦

వియప్పాయవియప్పిల్లా మెయ్ఞ్ఞానవేదియనైచ్
చయప్పుగఴార్పలర్వాఴుమ్ తడఙ్కురుగూర్చ్చడకోపన్,
తుయక్కిన్ఱిత్తొఴుదురైత్త వాయిరత్తుళిప్పత్తుమ్,
ఉయక్కొణ్డు పిఱప్పఱుక్కు మొలిమున్నీర్ఞాలత్తే. ౧౧

## మూన్ఱామ్పత్తు

## ఇరణ్డామ్ తిరువాయ్మొఴి



(మూలమ్)

మున్నీర్ఞాల మ్పడైత్త
వెమ్ముగిల్వణ్ణనే,
అన్నాళ్ నీతన్ద వాక్కైయి
న్వఴియుఴల్వేన్,
వెన్నాళ్ నోయ్ వీయ
వినైగళై వేరఱప్పాయ్న్దు,
ఎన్నాళ్ యానున్నై
యినివన్దు కూడువనే. ౧

స్వామి యని ని న్నెరింగి యా - చంద్రమౌళి
సన్నుతించు ట దేమి యా - శ్చర్య మింక. 10
అద్భుతాశ్చర్యగుణుడు స - ర్వాంతరాత్మ
యనుచు శ్రుతివాక్యములు గొని - యాడుచుండు
స్వామినింగూర్చి నమ్మాళ్ - వారు వ్రాయు
పాశురములలో నీపది - పాశురముల
భక్తితో నేజనంబులు - పఠన సేతు
రట్టివారు సంసారంబు - నంట కుంద్రు. 11

---

తృతీయ శతకము

ద్వితీయ దశకము

(ఆతురత)

ఇల నదీవర్ష భూజల - ముల నొసంగి
ప్రజల కాహార మిచ్చి కా - పాడు దేవ!
సృష్టి చేయుచు నాకు నీ - విచ్చినట్టి
యీ శరీరంబుతోడ నే - యెల్లయపుడు
పాపసంసారబంధన - కూప మందు
మునిగి తేలుచు నీదాస్య - ములను మరచి
తిరుగు చున్నాడ నీనాటి - వరకు నేను ;

* * *

అట్టిదోషంబులను బోవ - నడచి వైచి

వన్మా వైచ్చ్యమళన్ద
వెమ్ వామనా, నిన్
పన్మాయూయ ప్పల్
పిఱవియి ల్పడిగిన్ఱయాన్,
తొన్మానల్వినై త్తొడర్గళై
ముదలరిన్దు,
నిన్మాతాళ్ శేర్న్దు నిఱ్ప
దెజ్ఞాన్ఱుకొలో. ౧

కొల్లామాక్కోల్ కొలై శెయ్దు, పారదప్పోర్
ఎల్లాచ్చేనైయు మిరునిల త్తవిత్త వెన్దాయ్,
పొల్లావాక్కైయిన్ పుణర్వినై యఱుక్కలఱా,
శొల్లామానునైచ్ చ్చార్వదోర్ శూழ్ఛియే. ౩

శూழ్ఛ్చ్ ఞాన చ్చుడరోళియాగి, యెన్ఱుమ్
ఏழ్ఛ్చ్ క్కేడిన్ఱి యెఙ్గణుమ్ నిఱైన్ద వెన్దాయ్,
తాழ్ఛ్చమఱ్ఱెఙ్గు న్తవిర్న్దు నిన్ తాళిణైక్కీழ్,
వాழ్ఛ్చ యాన్ శేరుమ్వగై యరుళాయ్ వన్దే. ౪

విరహదుఃఖంబు స్వస్థత – పరచి నిన్ను
గానజేయుము కన్నుల – కరవు దీర. 1

భూమి గొల్చిన వామన! – పుణ్యచరిత!
లెక్క లేనట్టిమాయల – జిక్కి దేవ
మానుషాదిరూపంబుల – బూను చుండు
నన్ను సంకెళ్ళవంటి బం – ధములు పట్టి
ఆది యంతము లేనట్టు – లాడజేసె;

* * *

వాని మూలంబుతోగూడ – వదలిపైచి
నీకు బదసేవ సేయంగ – నేర్పు చెప్పుడో! 2

చంపుటకు సాధనము గాని – జాటికఱ్ఱ
గరము నిడి పదునెన్మి ద – క్షౌహిణులను
సంహరింపంగ నేర్చిన – జాణ వీవు,
అఘటన ఘటన శక్తుండ – వైన దేవ!

* * *

ఈ శరీరసంబంధము – నేవిధమున
ద్రెంప గల్గుదువో దాని దెల్పుమయ్య!
నిన్ను బొందంగ నటుమీద – దెన్ను గలుగు; 3

క్షయము వృద్ధియు నెరుగని – జ్ఞాన మంది
నిరుపమాన మహాతేజంబు – నిండియుండ
జగతి సర్వత్ర వ్యాపించు స్వామివి గద!
ఇతర విషయంబులం బ్రీతి – నిడుట మాని
నీపదాంభోరుహముల స – న్నిధికి జేరి
సుఖము చెందెడు మార్గంబు – చూపుమయ్య! 4

వన్దాయ్ పోలేవన్దు మెన్మనత్తినై నీ.
శిన్దామల్ శెయ్యాయ్ యిదువేయిదువాగిల్,
కొన్దార్ కాయావిన్ కొఴుమలర్ తిరునిఱత్త
వెన్దాయ్, యానున్నై యెఙ్గువన్దణుగిఱ్పనే. ౫

కిఱ్పన్ కిల్లే నెన్ఱిలన్
　　ముననాళాల్,
అఱ్పశారఙ్గ ళవై
　　శువై త్తగన్ఱొఴిన్దేన్,
పఱ్పల్లాయిర
　　ముయిర్ శెయ్ద పరమా, నిన్
నఱ్పొఱ్ శోదిత్తాళ్
　　నణుగువదెఞ్ఞాన్ఱే. ౬

ఎఞ్ఞాన్ఱునామిరు న్దిరున్దిరఙ్గినెఞ్జే,
మెయ్ఞ్ఞానమిన్ఱి వినైయియల్ పిఱప్పఴున్ది,
ఎఞ్ఞాన్ఱుమెఙ్గు మొఴివఱనిఱైన్దునిన్ఱ,
మెయ్ఞ్ఞానచ్చోది క్కణ్ణనై మేవుదుమే. ౭

మేవుతున్బవినైగళై విడుత్తుమిలేన్.
ఓవుదలిన్ఱి యున్కఴల్ వణఙ్గిఱ్ఱిలేన్,

నాడు ప్రహ్లాదుమనము నా - నందపరుప
దర్శనం బిచ్చినట్లు నా - దైన్య మెడల
సేవ నొసగి నామనమును - గావ వైతి ;
ఇట్లుపేక్షించుటే నైజ - మేని, నిన్ను
శ్యామసుందరరూప! యె - చ్చటికి బోయి
దర్శనము చేయవచ్చునో - దాని జెపుమ! 5

చేతు సత్కర్మముల నని - చెప్పనైతి
నే నసత్కర్మముల జేయు - నేర ననియు
బల్క నైతిని ; జిరకాల - పాపజనిత
దుఃఖసంసార జలధిలో - ద్రోయబడితి ;

*　*　*

భువనకోటి ననంత మా - భూతకోటి
సృష్టి చేసినపూరుష - శ్రేష్ఠ! నీదు
దివ్యపాదారవిందంబు - లవ్యయముగ
గాంచు నానంద మెప్పుడు - గలుగు నాకు. 6

నిశ్చయజ్ఞానశూన్య మై - నిఖిలపాప
సంచయం బగుసంసార - జలధియందు
ఇరుకుకొనిపోయి జన్మంబు - లెత్తు మనకు,
సర్వదేశకాలవ్యవ - స్థల జెలంగు
భూతముల యంతరాత్మ యై - పొందియుండు
శ్రీశుసందర్శనప్రాప్తి - యెట్లు గలుగు?
మానసమ! నీవు విరహంబు - మానుకొనుము! 7

దుఃఖహేతువు లై యున్న - దోషములను
బాపుకొన కుంటి ; - శ్రీపాద - పద్మములను

పావుత్తొల్ శీర్క్కణ్ణా వెన్ పరఞ్జుడరే
కూవుగిన్ఱేన్, కాణ్బా నెఞ్జెయ్ దకూఱ్ఱువనే. ౮

కూవిక్కూవి క్కొడువినైత్తూఴుళ్ నిన్ఱు,
పావియేన్ పలకాలమ్ వఴితిగైత్తలమరుగిన్ఱేన్,
మేవియన్ఱానిరై కాత్తవ నులగమెల్లామ్
తావియవమ్మానై, ఎఙ్గిని త్తలైప్పెయ్వనే. ౯

తలైప్పెయ్ కాలమ్ నమన్దమర్ పాశమ్విట్టాల్,
అలైప్పూణుణ్ణు మవ్వల్లలెల్లామగలక్,
కలైప్పల్ఞాన త్తెన్ కణ్ణనై క్కణ్డుకొణ్డు,
నిలైప్పెఱ్ఱెన్నెఞ్జ మ్పెఱ్ఱదు నీడుయిరే. ౧౦

ఉయిర్గళెల్లావులగు ముడైయవనైక్
కుయిల్ గొళ్ శోలై త్తెన్కుఱుగూర్ చ్చడకోపన్,
శెయిరిల్ శొల్లిశై మాలై యాయిరత్తుళిప్పత్తుమ్,
ఉయిరిన్నేలాక్కై యూనిడై యొఴివిక్కుమే. ౧౧

నెడ తెగని భక్తితో నాశ్ర - యింప కుంటి;
సకలకల్యాణశుభగుణ - సాగరుండ!
దివ్యపరిమళయుక్తజ్యో - తిస్స్వరూప!
పిలుచుచున్నాడ నిన్ను సే - వించుకొరకు,
ఎచట నీదర్శన మనుగ్ర - హింతువొక్కొ! 8

దోషఘోరాటవిని నిల్చి - త్రోవ దప్పి
చాలకాలంబుగా నందె - సంచరించి
విసివి వేసారి నిన్నిప్డు - పిలుచు చుంటి;
ఆల రక్షించునట్టి గో - పాలకుడవు
బలియహంకార మాపిన - వామనుడవు
నిన్ను సేవింప నెటకు బో - నేర్తు నేను. 9

స్వామి! విశ్లేషదుఃఖం బ - సాధ్యమగుచు
మరణవేదనవలె నాకు - భరము గాగ,
గరుణతో దర్శన మొసంగి - గాచినావు
సర్వదుఃఖంబులును నాకు - సమసిపోయె. 10

సర్వలోకేశ్వరుండైన - స్వామిగూర్చి
వ్రాయ బూనిన సమ్మాళు - వారి వేయి
పాశురంబుల నీపది - పాశురముల
భక్తితోడను శ్రద్ధతో - బఠనచేయు
మనుజు నాత్మను గప్పు దు - ర్మాంస మైన
కాయమును దొలంగించి మో - క్షం బొసంగు. 11

## మూన్ఱామ్ పత్తు

## మూన్ఱామ్ తిరువాయ్ మొఴి

---

(మూలమ్)

ఒఴివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని,
వఴువిలావడిమై శెయ్య వేణ్డునామ్,
తెఴికురలరువి త్తిరువేఙ్గడత్తు,
ఎఴిల్ కొళ్ శోది యెన్దై తన్దై తన్దైక్కే. ౧

ఎన్దై తన్దై
తన్దైక్కుమ్
మున్దై, వానవర్
వానవర్ కోనొడుమ్,
శిన్దుపూమగిఴుమ్
తిరువేఙ్గడత్తు,
అన్దమిల్ పుగఴ్
కారెఴిలణ్ణలే. ౨

అణ్ణల్మాయన్
అణిగొళ్ శెన్దామరై
క్కణ్ణన్, శెఙ్గనివాయ్
క్కరుమాణిక్కమ్,

# తృతీయ శతకము

## తృతీయ దశకము

(వేంకటాద్రి - శ్రీనివాసమూర్తి)

కొండచరియలలోన న - ఖండరీతి
శబ్దములు మ్రోగు వేంకటా - చలమునందు
సుందరంబులప్రోగు తే - జోమయంబు
నైన దివ్యవిగ్రహకాంతి - యరుదు దోప,
తాతతాతలకును హేతు - భూతు డైన
శ్రీనివాసునిపదసేవ - చేయవలయు,
సర్వదేశంబులను సర్వ - సమయములను ; 1

నిత్యసూరిబృందంబులు - నిత్యవిధిగ
బూజచేసి సమర్పించు - పుష్పసమితి
పరిమళించెడు వేంకట - పర్వతమున
గలియుగంబున భక్తర - క్షణ మొనర్ప
వాస మొనరించు నాశ్రీని - వాసమూర్తి,
తాతలకు దండ్రులకు దాత - తాతలకును
గారణం బౌచు జగముల - గన్న తండ్రి,
పరమప్రాప్యుండు మనపరం - పరలకెల్ల. 2

అద్భుతాశ్చర్యగుణముల - నలరువాడు,
సుందరముఖారవింద య - శోధరుండు,
పుండరీకాక్షు డై సదా - పొలుచువాడు,
రాగపూరితబింబాధ - రంబువాడు,

తెణ్ణిఱైచ్చునైనీర్
తిరువేఙ్గడత్తు,
ఎణ్ణిల్ తొల్ పుగழ
వానవరీశనే. 3

ఈశన్ వానవ ర్కెన్బనెన్రాల్, అదు
తేశమో తిరువేఙ్గడత్తానుక్కు,
నీశనేని ఱైవొన్రుమిలేన్, ఎన్గణ్
పాశమ్వైత్త పరఞ్జుడర్చ్చోదిక్కే. ౪

శోదియాగి యెల్లావులగుమ్ తొழுమ్,
ఆదిమూర్తి యెన్రా లళవాగుమో,
వేదియర్మ్ముழு వేదత్తముదత్తై,
త్తీదిల్ శీర్ తిరువేఙ్గడత్తానైయే. ౫

వేఙ్గడఙ్గళ్ మెయ్మ్మేల్వినై ముற்றవుమ్,
తాఙ్గళ్ తఙ్గట్కు నల్లనవే శెయ్ వార్,
వేఙ్గడత్తుఱైవార్క్కు నమవెన్న
లాఙ్గడమై, అదుశుమన్దార్గట్కే. ౬

శుమన్దుమామలర్ నీర్ శుడర్ తూపఙ్గొణ్డు,
అమర్న్దువానవర్ వానవర్ కోనొడుమ్,
నమన్దెழுమ్ తిరువేఙ్గడమ్ నఙ్గట్కుచ్,
చమన్గొళ్ వీడుతరుమ్ తడఙ్కున్రమే. ౭

నీలమాణిక్యకాంతుల - నేలువాఁడు
నగు రమాపతి శ్రీవేంక - టాద్రియందు
సకలకల్యాణగుణసార - సాత్వు డగుచు
వెలసి యున్నాఁడు జగముల - వేల్పు గాఁగ. 3
గుణవిహీనుండ నీర్ష్యాది - గుణయుతుండ
నైన నను బ్రేమతోఁ గాంచి - యాదరించి
సంగయుక్తుఁ డై చెలఁగెడు - సత్ప్రకాశు
డమరులకు స్వామి యగు టొక్క - యతిశయం బె? 4
వేదవేద్యుఁ డై భోగ్యుఁ డై - వెలయువాని
బరమపావను శ్రీశైల - పతిని, భువన
కారణుం డని పల్కిన - ఘనత యగు నె!
సర్వలోకాశ్రయుం డన - సందియం బె! 5
వేంకటాచలపతి యైన - విష్ణుదేవు
దాసుఁడను గాని నేను స్వా - తంత్ర్యపరుఁడఁ
గా నటంచు వచించెడు - మానవులకు
జెలఁగు పాపంబు లెల్లను - దొలఁగి చనును;
గర్మబంధసంగంబులు - గలుగకుండు;
నిది యథార్థంబు గాన యి - ట్లెద దలంచు
వారలకు స్వామికైంకర్య - ఫలము గల్గు. 6
శ్లాఘ్య మగు పుష్పములతోడ - జలముతోడ
ధూపదీపజాలంబుల - తోడ వచ్చి
పూజచేసి నమస్కార - పూర్వకముగ
స్తోత్రము లొనర్చుకొను నిత్య - సూరు లెల్ల
రాశ్రయించెడు శ్రీవేంక - టాద్రి మనకు
బరమపురుషసమాన మా - పదము నిడదె. 7

పఙ్గయక్కణ్ణనెన్గో
పవళచ్చెవ్వాయనెన్గో,
అఙ్గదిరడియనెన్గో
అఞ్జనవణ్ణనెన్గో,
శెఙ్గదిర్ముడియనెన్గో
తిరుమరుమార్వనెన్గో,
శఙ్గుశక్కరత్తనెన్గో
శాదిమాణిక్కత్తైయే. 3

శాదిమాణిక్కమెన్గో
శవిక్కొళ్ పొన్ముత్తమెన్గో,
శాదినల్వైయిరమెన్గో
తవివిల్ శీర్విళక్కమెన్గో
ఆదియఞ్జోదియెన్గో
ఆదియమ్పురుడనెన్గో,
ఆదుమిల్ కాలత్తెన్దై
యచ్చుదనమలనైయే. ४

